శ్రీః

# మాళవికాగ్నిమిత్రము



కృతికర్త:

విద్వాన్ యరసూరి మల్లికార్జునరావు P. O. L.



1951

వెల రూపాయిన్నర.

శ్రీః

# ఉపోద్ఘాతము

రసాత్మక మైన వాక్య మొక్కటియుఁ గావ్యమగును. తన్నిర్మాత కవియు నగును. ఆకావ్యము గద్యము కానిండు పద్యము కానిండు; హృద్యమై, రసికజనరంజకమై, యలరారి నప్పుడే కావ్యప్రయోజనము చేకూర్చును. కవియు గణనీయుఁ డగును. ఇది పూర్వపుణ్య సముపలభ్యము. పాండిత్యము కవిని సృజింపలేదు; కాని యతనిని తీర్చి దిద్దఁగలదనుట నిస్సంశయము.

ఇఁకఁ బ్రకృతము. ముగ్గులు మూట కట్టు చక్కని యీ నాటకరత్నమునకు సంస్కృతమునఁ గర్త కాళిదాసు. ఇతఁడు జగ మెఱింగిన వాఁడు. నమోవాకము. ఈకృతికి వెలసిన భాషాంతరీకరణములు పెక్కులు. అన్నియు నన్ని విధములు, మహిమాన్వితములు. భాషాంతరీకరణము కవిత్వమగు ననుట సహృదయైక వేద్యము.

ఒక్కమాట. "గద్యరచనలుకూడ ప్రదర్శనార్హములు" లను సిద్ధాంతము ననుసరించి దీని నిట్లు తెనిఁగించితిని. ఇందలి దోసఁగులు మాత్రమ నావి. రసౌచితి ననుసరించి

కావించిన యలంతి మార్పులు సహృదయ క్షమార్హము లగుఁగాత మని వేడికోలు.

ఈ గ్రంథమును త్వరలో నచ్చొత్తించి యిచ్చిన శ్రీ బాక్సుప్రెస్సువారి కెంతయుఁ గృతజ్ఞుడను.

రాజమండ్రి
26-3-51

కృతికర్త
మల్లికార్జునరావు.

---

# నాటకమందలి పాత్రలు

## పురుషులు

1. సూత్రధారుఁడు
2. పారిపార్శ్వకుఁడు
3. గణదాసు. } ఉపాధ్యాయులు
4. హరదత్తుడు }
5. అగ్నిమిత్రుఁడు—రాజు
6. గౌతముఁడు—విదూషకుఁడు
7. వాహతకుఁడు—మంత్రి
8. మౌద్గల్యుఁడు—కంచుకి
9. సారసకుఁడు—పరిచారకుఁడు
10. వైతాళికులు

## స్త్రీలు

1. ధారిణి—పట్టమహిషి
2. ఇరావతి—రాజు రెండవ భార్య
3. మాళవిక—నాయిక
4. పరివ్రాజిక—యోగిని
5. జయసేన—ప్రతీహారి

| | |
|---|---|
| 6. వకుళావళిక | పరిచారికలు |
| 7. కౌముదిక | |
| 8. సమాహితిక | |
| 9. మధుకరిక | |
| 10. నిపుణిక | |
| 11. మదనిక | |
| 12. జ్యోత్స్నిక | |

ఇంకను గొందఱు పరిచారకులు, పరిచారికలును.

---

శ్రీః

# మాళవికాగ్నిమిత్రము

శాశ్వతైశ్వర్యదుండయ్యుఁ జర్మధారి
యర్ధనారీశుఁడయ్యును నతివిరాగి
నిఖిల భూభారకుండయ్యు నిరభిమాని
అయిన పరమేశుఁ డజ్ఞాన మడఁచుఁ గాక.

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు—(తెరవంక చూచి) మారిషా! ఇటురమ్ము.

పారిపార్శ్వకుఁడు—(ప్రవేశించి) ఆర్య! వచ్చితిని.

సూత్ర—శ్రీ కాళిదాస విరచితంబగు "మాళవికాగ్నిమిత్ర" మను నాటకము నీ వసంతోత్సవ సమయంబునఁ బ్రయోగింపవలయునని విద్వజ్జనంబుల యాజ్ఞ. కావున సంగీత మారంభింపవలయును.

పారి—కాదు కాదు. మహాయశస్కులగు భాససౌమిల్లాది కవికుమారుల గ్రంథములఁ ద్రోసివుచ్చి యధునాతనుఁడగు కాళిదాసుని గ్రంథమం దీ విద్వజ్జనంబున కాదర మెట్లు?

సూత్ర—ఓయీ! తెలివితక్కువగాఁ బల్కితివి. చూడుము.
ప్రాఁత దైనంతమాత్రానఁ గావ్యజాత మంతయు నిర్దుష్టమనరాదు. క్రొత్తదన్నంతమాత్రాన దుష్ట మును గాఁజాలదు. చక్కఁగ బరీక్షించినపిమ్మట సజ్జను లెద్దానినైనఁ బరిగ్రహింతురు. మూఢు లెవ రెట్లుచెప్పిన నట్లే యనుసరింతురు.

పారి—చిత్తము.

సూత్ర—ఇంక నీవు త్వరపడవలెను. నేవాదట్కుఁ డగు ధారిణీదేవి భృత్యునివలె నేనును బరిషదాజ్ఞను శిరసా వహించి నెఱవేర్చెదను. (నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.



# మాళవికాగ్నిమిత్రము

## ప్రథమాంకము

[వకుళావళిక ప్రవేశించును]

వకు——"భరత నాట్యమభ్యసించు నిమిత్తమై గణదాసున కప్పగించిన మాళవిక విజ్ఞాన మెట్లున్నదో ఆచార్యుల నడిగి రమ్మ"ని ధారిణీదేవి యాజ్ఞ. కావున సంగీతశాల కేగెదను. (వెళ్ళుచున్నది)

[కౌముదిక ప్రవేశించును.]

వకు——చెలీ! కౌముదికా! ఏమమ్మా ఇంత శ్రీమంతము! దగ్గరగా వెళ్లుచు, తొంగియైనను జూడకున్నావు.

కౌము——వకుళావళికా! నీవా! సఖీ! నాగముద్రాంచితమైన దేవియుంగరము నిప్పుడే కంసాలినుండి తెచ్చుచు దీని పనితనమును బరిశీలించుచుండఁగా నింతలో నీ వెత్తిపొడుపునకు గుఱి యయితిని.

వకు——(ఉంగరమునుజూచి) అయితే నీవు తగినవస్తువునే చూచుచున్నావు. నిగనిగలాడెడి యీ యుంగరము మూలమున నీ ముంజేయి పూలుపూచినట్లు ప్రకాశించుచున్నదమ్మా!

కౌము——సఖీ! ఎచటికి బయలుదేరితివి?

వకు—దేవియానతి చొప్పున మాళవిక విజ్ఞానవిషయమై గణ
దాసు నడిగి తెలుసుకొనుటకు బయలుదేరినాను.

కౌము—సఖ! ఈతీరుగ నసన్నిహితురాలుగదా మాళవిక !
ఆమెను బ్రభువులు చూచినారంట కదా ?

వకు—అవును. దేవీపార్శ్వమందే ఆసీనయై యుండ, ఆమెను
బ్రభువులు ఫొటోలోఁ జూచినారు.

కౌము—ఎలాగూ !

వకు—విను. దేవి క్రొత్తగాఁ దీయించుకొన్న ఫొటోను చిత్ర
శాలలో గణదాసునకుఁ జూపుచుండఁగా నింతలో,
బ్రభువులును వచ్చుటకే తెంచినారు.

కౌము—తరువాత ?

వకు—స్వాగతాదు లయిన పిమ్మట ప్రభువులు దేవీయాసన
మందే సమాసీనులై ఫొటోలో దేవికి ప్రక్కనే
కూర్చున్న యువతినిగూర్చి "ఈమె ఎవర" ని యడి
గినారు.

కౌము—ఎట్లెట్లూ !

వకు—"ఈ యువతి యపరిచిత యట్లున్నది. దేవీపార్శ్వ
మందే సమాసీనయై యున్నది. ఈమె పేరేమి?" అని.

కౌము—ఒక్కొక్క యాకార మట్లడిగించునులే. తరువాత?

వకు—తరువాత దేవి యామాటలను గీఁకొల్పఁగా, ప్రభు
వులు తిరిగి యడుగుటకు సందేహించుచుండిరి. ఇంతలో
వసులక్ష్మి "ఈమె మాళవిక" అని చెప్పివేసినది.

కౌము—(చిఱునవ్వుతో) పసితనము కాదూమఱి. తరువాత చెప్పుము.

వకు—తరువాత నేమున్నది. ఇప్పుడు మాళవిక రాజునకుఁ గనుపడకుండునట్లుగఁ జేయఁబడుచున్నది.

కౌము—నీపని నెఱవేర్చుకొమ్ము. ఈ యుంగరమును దేవి కిచ్చెదను. (వెళ్లుచున్నది.)

వకు—(కొంచెము నడచి చూచి) ఇతఁడే నాట్యాచార్యుఁడగు గణదాసు. సంగీతశాలనుండి యిప్పుడే బయలు దేరుచున్నాఁడు. పోయి దర్శించెదను. (వెళ్ళుచున్నది.)

[ప్రవేశించి]

గణదాసు—కులవిద్య యెల్లరకును నభిమతమేకదా! నాట్యము విషయమై మాకున్నది మిథ్యాగౌరవము కాదు. ఏల నన మహర్షు లీ నాట్యమును దేవతల చాక్షుష క్రతువునుగఁ దలంచుచున్నారు. భార్యానిమిత్తమై పరమేశ్వరుఁడీ నాట్యమును ద్వివిధముగ, తన శరీర మందే విభజించియున్నాఁడు. త్రైగుణ్యోద్భవము నానారసవదుత్కృష్టము నగు లోకచరిత మీ నాట్య మందే యగపడుచున్నది. భిన్నభిన్న రుచులుగల జనులనుసైత మనేకవిధముల నారాధింపఁగల దీ నాట్య మొక్కటియే.

వకు—(సమీపించి) ఆర్య! నమస్కారము.

గణ—కళ్యాణి! చిరంజీవ.

వకు—ఆర్య ! "ఉపదేశగ్రహణమున మీ శిష్య మాళవిక మిమ్ములను నెక్కుడుగ క్లేశపఱచుట లేదుకదా !" అని దేవిగా రడిగి రమ్మన్నారు.

గణ—కల్యాణి ! మాళవిక పరమనిపుణయనియు, మేధావిని యనియు మీ దేవికి విన్నవింపుము. పెక్కుమాట లెందుకు ? ప్రయోగవిషయమై తన కుపదేశించిన దానిని చక్కఁగ నభినయించుచు నాకే ప్రత్యుపదేశము చేయునదివలె నున్నది.

వకు—(తనలో) ఇరావతిని మించుచున్న దనుకొందును. (ప్రకాశముగ) ఉపాధ్యాయులే యిట్లు సంతసించుటం జేసి మీ శిష్య యెంతయు ధన్యురాలు.

గణ—కల్యాణి ! అట్టివారు దుర్లభులుగదా! యని యడుగుచున్నాను. మీ దేవి కీమె యెట్లు లభించినది ?

వకు—మా దేవికిఁ గులహీనుఁ డగు వీరసేనుఁ డను సోదరుఁ డొకఁడు గలఁడు. ప్రభువులే యతనిని అంతపాలదుర్గమున కధికారిగ నియమించిరి. అతఁడే యీ బాలికను "శిల్పాధికారయోగ్య" యని దేవి కుపాయనముగఁ బంపినాఁడు.

గణ—(తనలో) ఆకృతివిశేషముచే నీమె హీనకులజ కాదని తలంతును. (ప్రకాశముగ) కల్యాణి ! నేనును యశోవంతుఁడ నయ్యెదను. చూడుము. వానచినుకులు సముద్రశుక్తులందు పడి ముత్తియములైనట్లే ఒకో్క

వ్కరికిఁ జెప్పిన విద్య ఆచార్యునకును గీర్తిని గలిగించును.

వకు—ఆర్య ! మీ శిష్యురా లిప్పు డెచ్చట నున్నది ?

గణ—పంచాంగాభినయ ముపదేశించినపిదప, "కొంచెము విశ్రమింపు" మని యిప్పుడే నేను జెప్పఁగా దీర్ఘిక నవలోకించుచు గవాక్షము నధిష్ఠించి శీతలమారుత మును సేవించుచున్నది.

వకు—తమ యానందమును విన్నవించి యామె యుత్సాహ మును రెట్టించెదను. అనుగ్రహింపఁ గోరెద.

గణ—పోయి నీ సఖని జూడుము. నేనును సుఖముగ నింటికిఁ బోవుదును. (ఇరువురు నిష్క్రమింతురు.)

[మంత్రి లేఖను జదువుచుండఁగా రాజు వినుచుండును. పరిజను లొక పార్శ్వమున నుందురు.]

రాజు—(మంత్రిని జూచి) వాహంతక ! ఆ వైదర్భుఁ డేమి తలంచినాఁడు ?

అమాత్యుఁడు—దేవ ! ఆత్మవినాశమును.

రాజు—ఏదీ ! సందేశమును వినిపింపుము.

అమా—ఇదిగో. అతఁడు వ్రాసినజాబు. "మీ పినతండ్రి కుమారుఁ డగు మాధవసేనుఁడు సంబంధనిశ్చయార్థ మేతెంచుచుండఁగా మధ్యేమార్గంబున మీ అంత పాలునిచే నిగృహీతుఁడయ్యెను. నా యందలిప్రేమచే నైనను నాతనిని కళత్రసోదరీసమేతునిగా తమరు విడి

పింపవలయును'' అని పూజ్యులలేఖ. రాజులకు జరుగ వలసిన మర్యాదలు మీ రెఱుంగనివి కావు. ఈవిషయమునఁ దాము తాటస్థ్యము వహించియుండుట లెస్స. ఈ నిగ్రహసందర్భమున నాతనిసోదరి యేమైనదో జాడ తెలియుటలేదు. ఆమెను వెదకుటకై ప్రయత్నించెద. నిజముగ మాధవసేనుని విడిపించుట మీ కభిమతమగునో "నాంభావమ ఆదియగు మౌర్య సచివుని తమరు విడిపించినపుడు మాధవసేనుఁడును విముక్తుఁడు కాఁగలఁడు" ఈ అభిసంధిని మన్నింపఁ గోరెద.

రాజు—(కోపముతో) ఏమి! ఈ పొగరుబోతు లంచము నపేక్షించుచున్నాఁడుగా నా విషయమున? వాహ్లాతక! ఈ వైదర్భుఁడు మొదటినుండియు నా కమిత్రుఁడును బ్రతికూలకారియుఁ గూడ. శత్రుపక్షము వహించిన యీతని సమూలనాశనముకై వీరసేన ప్రముఖ సైనికుల నాజ్ఞాపింపుము.

అమా—చిత్తము. ప్రభువుల యాజ్ఞ.

రాజు—పోనీ! నీవేమి తలంచెదవు?

అమా—శాస్త్రపద్ధతిని బ్రభువులే సెల విచ్చియున్నారు. ఏమన, నూతనముగ సింహాసన మధిష్ఠించిన నరపతికిఁ బ్రజలలో వేళ్ళు పాతి యుండవు. నాటినతోడనే వాడిపోయిన మొలక వలెనే ఇతనిని సులభముగఁ బెకలింపవచ్చును.

రాజు—అయితే శాస్త్రకారుని మాట యథార్థమే. దీనినే శుభశకునముగ భావించి సేనాపతిని నియమింపుము.

అమా—చిత్తము. (నిష్క్రమించును.)

[పరిజనులు ప్రభువును సేవించుచుందురు. విదూషకుఁడు ప్రవేశించును.]

విదూ—మాళవికను జూచుట కేదేని యుపాయ మాలోచింపు మని వయస్యునియాజ్ఞ. నేనును నట్లే యాలోచించితిని. ఇంక దేవరకు విన్నవించెద. (ముందుకు నడచును.)

రాజు—(విదూషకుని జూచి) ఇతఁడు వేఱొక కార్యాంతర సచివుఁడు. నన్నే సమీపించుచున్నాఁడు.

విదూ—(సమీపించి) విజయీభవ.

రాజు—(తలనూపుచు) ఇటు కూర్చుండుము. (విదూషకుఁడు కూర్చుండును.)

రాజు—నీ ప్రజ్ఞానయన ముపాయాలోచనమునఁ బని చేయుచునే యున్నది కదా!

విదూ—ప్రయోగసిద్ధిని గూర్చి యడుగుము.

రాజు—అదెట్లు.

విదూ—(చెవిలో) ఇట్లు (అని చెప్పును.)

రాజు—భేష్. మిత్రమా! చక్కటి యెత్తు నెత్తితివి. అసాధ్యమే యైనను ప్రస్తుతవిషయమున నాశ జనించుచున్నది. ఎట్లన, ప్రతిబంధయుత మగు ప్రయోజన

మును సాధింపవలె నన్నచోఁ బ్రభువులు తప్పకససహా యులై యుండవలెను. నయనము లున్నను చీకటి లోని వస్తువు దీపములేనిదే యగపడదు గదా.

[ తెరలోఁ ]

"చాలు చాలు నీ బడాయితనము. రాజసమక్షమందే నీ నా యెక్కువ తక్కువలు ప్రకటితములు కాఁగలవు."

రాజు——(విని) మిత్రమా! నీ నీతిపాదపము పుష్పించుచున్నది.

విదూ——త్వరలోనే ఫలమును గూడ చూడఁగలవయ్యా!

[కంచుకి ప్రవేశించును.]

కంచు——దేవ! దేవరవారి యాజ్ఞ యనుష్ఠింపఁబడిన దని యమాత్యపుంగవులు విన్నవించుచున్నారు. వీరిరువురును హరదత్తగణదాసులు. అభినయాచార్యులు. పరస్పర విజిగీషువులై దేవర సందర్శనము నాశించుచున్నారు.

రాజు——లోనికిఁ దీసికొని రమ్ము.

కంచు——చిత్తము. (అని వెళ్లెను.) (తిరిగి ప్రవేశించి) మహాభాగులారా! రండు. రండు.

గణ——(రాజును జూచి) ఆహా! రాజమహిమ దుర్లభము కదా. అపరిచితులు గాని అయిష్టులుగాని లేకున్నను నితనిని సమీపించుట భయముగనున్నది. జలనిధి

వలె నా కన్నుల కితఁ డనుక్షణమును గొంగ్రొత్తగ
నగపడుచున్నాఁడు.

హార—ఇది యొక మహత్తరమైన పురుష తేజము కదా.
ద్వారమునందలి పహరాజమానుల యనుమతిని
బడసి, సన్నిహిత పరిచారకునితోఁ గలసి సమీపించు
చున్నను జూపులను మిఱుమిట్లు గొల్పెడి యీతని
తేజములు ప్రతిషేధవాక్యములు లేకుండగనే నన్ను
నివారించుచున్నట్లున్నవి.

కంచు—ఇరుగో ప్రభువులు. సమీపింపుఁడు.

ఇఱువురు—(సమీపించి) విజయీభవ.

రాజు—ఇఱువురకును స్వాగతము. (పరిజనుల వంక చూచి)
వీరి కాసనములను దీసికొని రండు.

[ఇద్దరును ఆసనము లధిష్ఠించుచున్నారు.]

రాజు—ఏమిది? శిష్యులకుఁ బాఠములను జెప్పెడి సమయ
ములో నుపాధ్యాయు లిద్దరు నొక్కమారే యిచ్చ
టికి వచ్చితిరి?

గణ—రాజా! వినుఁడు. సుతీర్థుని కడ నే నభినయవిద్య నభ్య
సించితిని. బోధకుఁడను గూడ నయితిని. రాజదంపతు
లచేఁ బరిగ్రహింపఁ బడితిని.

రాజు—అవును. బాగుగ నెఱుఁగుదును. అయిన నేమి?

గణ—అట్టి నన్ను ప్రధానపురుషుల సమక్షమున ఈ హార
దత్తుఁడు తన కాలిధూళికి నైనను సరిపోల నని యధి
క్షేపించినాఁడు.

హర—దేవా! మొదటఁ దృణీకరించిన వాఁ డితఁడే. ఈమహా భాగునకును నాకును సముద్రపల్వలముల కున్నంత యంతరము కలదఁట. కావున, దేవరవారే యితనిని నన్నును శాస్త్రమందును బ్రయోగమందును గూడ పరీక్షింపుఁడు. విశేషజ్ఞులగుఁ బ్రభువులే మాకీయెడఁ బ్రాశ్నికు లయ్యెదరు గాక.

విదూ—ప్రతిజ్ఞ చాలా బాగున్నది.

గణ—చాలా బాగున్నది. సావధానచిత్తులరై ప్రభువు లాలకింపవలెను.

రాజు—ఉండుఁడు. దేవి యీ విషయమునఁ బక్షపాతము దలంచును. కావునఁ బండితకౌశికీసమేత యగు నామె సమక్షమందే యీ వ్యవహారము పరిష్కరించుట న్యాయము.

విదూ—చక్కఁగాఁ జెప్పినావయ్యా!

ఇరువురు—ప్రభువుల చిత్తము వచ్చినట్లు.

రాజు—మౌద్గల్య! ఈ విషయమును నివేదించి పండితకౌశికితోఁ గూడ దేవి నాహ్వానింపుము.

కంచు—చిత్తము. (వెళ్ళును.)

[పరివ్రాజికను దేవిని వెంట నిడికొని తిరిగిప్రవేశించి]

కంచు—అమ్మా! ఇటురండు. ఇటురండు.

దేవి—(పరివ్రాజికనుజూచి) పూజ్యురాలా! హరదత్త గణదాసుల కలహమును గూర్చి నీ వేమని తలంతువు?

పరి—నీ పక్ష మోఁడిపోవు నను శంక వలదు. గణదాస్యైనను బ్రతివాదికి వెనుదీయువాఁడు కాఁడు.

దేవి—నిజమే. కాని రాజస్వీకార మాతనికి గౌరవము కట్టఁ బెట్టును.

పరి—నీవు మహారాణి వన్న సంగతిని జ్ఞప్తికిఁ దెచ్చుకొమ్ము. చూడుము. అరుణపరిగృహీతుఁడై యనలుఁడు ప్రకాశించుచున్నాఁడు. నిశాపరిగృహీతుఁడై చంద్రుఁ డును మహిమాన్వితుఁ డగుచున్నాఁడు గదా!

విదూ—మిత్రమా! పీఠమర్దికయగు పరివ్రాజికను వెంటనిడి కొని మహారాణి రానే వచ్చిన దోయీ!

రాజు—చూచుచున్నాను. ఆకృతిఁ దాల్చిన త్రయీవిద్య, యధ్యాత్మ విద్యచే వలె మంగళాలంకృత యగు నీమె యును యతివేషధారిణి యగు పరివ్రాజికచేఁ బ్రకాశిం చుచున్నది.

పరి—(సమీపించి) విజయుండ వగుము.

రాజు—పూజ్యురాలా! నమస్కరించుచున్నాను.

పరి—మహాసారప్రసవములను, సద్వృక్షమును, గల్గియున్న ఈ ధారిణీభూతధారిణులకుఁ గలకాలము భర్త వగుము.

ధారి—ఆర్యపుత్రులకు జయము.

రాజు—దేవికి స్వాగతము. (పరివ్రాజికను జూచి) అమ్మా! ఆసన మలంకరింపుము. (అందఱును గూర్చుందురు.)

రాజు—పూజ్యురాలా! మహాభాగులును బరస్పర విజ్ఞాన విజిగీషువులునగు నీ హరదత్త గణదాసులమధ్య తమరు న్యాయపీఠము నధిష్ఠింపవలయును.

పరి—(చిఱునవ్వుతో) చాలు నుపాలంభము. పట్టణ ముండఁగా, పల్లెలోనా రత్నపరీక్ష ?

రాజు—అట్లుకాదు. పండితకౌశికివికదా. నేనును దేవియు నన్యతర పక్షపాతమును గల్గియుండవచ్చును.

ఇద్దఱు—ప్రభువులు చక్కఁగాబల్కిరి. నిష్పక్షపాతిని యగు నీ పూజ్యురాలే మా మా గుణదోషముల నావిష్కరించును.

రాజు—అయినచో నింక మీ వివాదము నారంభింపుఁడు.

పరి—దేవా! నాట్యశాస్త్రము ప్రయోగప్రధానము. ఇందు వాగ్వ్యవహారమునకుఁ బనేమున్నది ? దేవి యేమని భావించునో ?

ధారి—నన్నడిగినచో నీ వివాదమునే అంగీకరింపను.

గణ—దేవి! సాటివానియొద్ద తీసికట్టువానినిగఁ దలంపకుము.

విదూ—దేవి! ఇదంతయు నురభ్రసంవాద మనుకొందును. ఎందుల కనవసరముగా వీరి కీ జీతములిచ్చుట ?

ధారి—కలహప్రియుఁడవయ్యా!

విదూ—కాదుకాదు. కలహించిన మదగజములు రెండింటి లోనే యొక్కటైన నోడిపోకున్నచో శాంతియెట్లు ?

రాజు—అంగసౌష్ఠవ మిద్వారకును సమముగనే పూజ్యురాలు తిలకించుచున్నారు కదా.

పరి—అవును.

రాజు—ఇంతకు మిక్కిలి వీరలనుండి తెలియఁదగిన దేముండును ?

పరి—(చిఱునగవుతో) అదియే చెప్పఁదలఁచితిని. ఒక్కొక్కని విద్య హృదయమందే నిగూఢమై ప్రకాశించును. వేఱొక్కనివిద్య యితరులకు సంక్రమించునదై రాణించును. ఎవని కీ రెండును మిన్నఁగ నుండునో అతఁడే శిక్షకులలో నగ్రేసరుఁడు.

విదూ—వింటిరి కదా రాజదంపతు లీ పూజ్యురాలి మాటలను. తేలిన సారాంశ మిది. "ఉపదేశ దర్శనముచేతనే నిర్ణయము జరుగు" నని.

హర—నాకు మిక్కిలి సంతోషము.

గణ—అమ్మా! ఇట్లే జరుగనిండు.

ధారి—ఒకవేళ శిష్యురాలు తెల్వితక్కువదై యుపదేశమును బాడుచేసికొన్నచో నది యాచార్యుల దోష మగునా?

రాజు—దేవి! ఇట్లు సరిపెట్టుకో వచ్చును. "తెల్వితక్కువ వారిని శిష్యులనుగఁ బరిగ్రహించుట చేతనే యాచార్యుల బుద్ధిమాంద్యము ప్రకటిత మగు" నని.

ధారి—(జనాంతికముగ) ఇప్పు డెట్లు? (గణదాసు వంక చూచి) ఉత్సాహకారణ మగు ప్రభువుల మనోరథ

మును బూరించుట చాలును. ఈ నిరర్థకప్రయత్నము నుండి విరమింపుము.

విదూ——దేవి లెస్సగఁ బల్కినది. ఓ గణదాస! సంగీతోపాధ్యాయుఁడవై సరస్వతికిఁ బోసిన యుండ్రాళ్లను మెక్కుచున్న నీ కీ సులభనిగ్రహావివాదములోఁ బనే మున్నదిలే.

గణ——సత్యము. మహాదేవి భాషణమున కిట్టి యర్థమే వచ్చుచున్నది. వినుఁడు. సమయము వచ్చినది కావునఁజెప్పుచున్నాను. "ఉద్యోగమొట్లును లభించినది కదా యని వాదమునకు భయపడి పరులొనర్చు నిందలను సహించుచుఁ దన పాండిత్య ముదరంభరణార్థమే యని తలంచుచో నట్టివానిని జ్ఞాన మమ్ముకొను వైశ్యునిగఁ దలంచెదరు.

ధారి——మొన్ననే కదా యీ శిష్యురాలు మీ కడకు వచ్చినది. ఉపదేశ మంతయుఁ బూర్తి కాక మునుపే ప్రదర్శనమున కియ్యకొనుట యన్యాయము గదా!

గణ——కనుకనే నా నిర్బంధము.

ధారి——అయినచో మీ యిరువురి యుపదేశమును బరివ్రాజికకుఁ బ్రకటింపుఁడు.

పరి——దేవి! ఇది న్యాయము కాదు. సర్వజ్ఞుఁడైనను నేకాకిగ నిర్ణయించుట దోషమే యగును.

ధారి—(జనాంతికముగ) అమాయికురాలా! మేలొక్కనియు
న్నను నన్ను నిగ్రహించుదానినిగఁ జేయుచున్నావు.
(అసూయతోఁ బ్రక్కకుఁ దిరుగును.)

[రాజు దేవిని బరివ్రాజికకుఁ జూపును.]

పరి—(చూచి) దేవి! నిష్కారణముగఁ బ్రిభువునకుఁ బరా
ఙ్ముఖవయ్యెదవేల? కారణకోపముగల కాంతలు భర్తల
యెడ నెంతకైనను సమర్థురాండ్రేకదా.

విదూ—కారణము లేకేమి? తనపక్ష మెట్లైన నెగ్గించు
కోవలెనని. (గణదాసువంక చూచి) విధివశాత్తు దేవి
గారి కోపమువలన నీవు రక్షింపఁబడితివయ్యా. చదువు
కొనిన వారందఱు నుపాధ్యాయులు కాఁగలరా?

గణ—దేవి! వినుఁడు వినుఁడు. లోక మిట్లని యనుకొనును.
కావున నిప్పుడు నాపాండితి నంతయు నీ వివాదమునఁ
బ్రదర్శించెదను. అనుగ్రహింపకున్నచోఁ బరిత్యజించి
రనుకొందును. (ఆసనమునుండి లేవఁబోవును.)

ధారి—(తనలో) ఏమిదిక్క. (ప్రకాశముగ) శిష్యుల
విషయమున గురువులే యన్నిఁటికిని సమర్థులు.

గణ—ఇంతసేపు నిష్కారణముగ శంకించితిరి. (రాజును
జూచి) దేవి యనుజ్ఞ నొసంగినది. ప్రభువులును
నాజ్ఞాపింపుఁడు. ఏ యభినయోపదేశము ప్రదర్శింప
వలెనో?

రాజు—పరివ్రాజిక దేనిని శాసించునో.

పరి—దేవి మనసులో నేమో అనుకొనుచున్నట్లున్నది. అందుచే సందేహించుచుంటిని.

ధారి—ఇచ్చవచ్చినట్లు చెప్పుము. నిజపరివారముయెడఁ బ్రభువు లెంతకైనను నర్హులు.

రాజు—"నాకుఁగూడ" అని యనుము.

ధారి—పూజ్యురాలా! ఆదేశింపుము.

పరి—జయదేవ కృతి ఛలికమునకు దుష్ప్రయోజ్యమందురు. అందలి యొకే గేయములో వీరిప్రయోగమును దర్శింతము. అప్పుడు వీరి యంతరము వ్యక్తము కాఁగలదు.

ఇద్దఱు—పరివ్రాజిక యాజ్ఞాపించినట్లు.

విదూ—అట్లైనచో మీరిద్దరును ప్రేక్షాగారమున సంగీత రచన మొనరించి యీ మహాభాగున కొక దూత నంపుఁడు. పోనీలెండి. మృదంగవాద్యమే మమ్ములను బ్రస్థాపింపఁగలదు.

హర—అట్లు! (లేచును.)

గణ—(ధారిణిని జూచును.)

ధారి—(గణదాసుని జూచి) విజయీభవ.

[ఉపాధ్యాయులు నిష్క్రమింతురు.]

పరి—ఉపాధ్యాయులారా! ఒక్క మాట.

ఇద్దఱు—వచ్చితిమి. ఏమి సెలవు.

పరి—అధికారపురస్సరముగఁ బల్కుచుంటిని. సర్వాంగసౌష్ఠవాభివ్యక్తికై స్వల్ప నేపథ్యములతోఁ బాత్రలు ప్రవేశింపవలెను.

ఇద్దఱు—ఇదియును మా కుపదేశింపవలెనా? (వెళ్లుదురు)

ధారి—(రాజును జూచి) రాజకార్యములందుఁగూడ ఆర్యపుత్రున కిట్టి నైపుణ్య మున్నచో నింకను రాణింతును గదా!

రాజు—దేవి! అన్యథా తలంపవలదు. ఇదంతయు నా పన్నాగము కాదు. సరిసమానముగ విద్య నభ్యసించినవార లొకరికీర్తి నొకరు సహింపఁజాలరు.

[తెరలో మృదంగధ్వని. అందఱు వినుచున్నారు.]

పరి—అరరే. సంగీత మారంభ మైనదే. ఉరుము లనెడి శంకతో మెడల నిగుడించి మయూరములు చేసెడి ధ్వనివలె నున్న యీ మృదంగనాదము మనంబుల మదింపఁజేయుచున్నది.

రాజు—దేవీ! ఆ సంగీతమునకు సామాజికుల మగుదము.

ధారి—(తనలో) ఆహా! ఆర్యపుత్రుని యవినయము?

[అందఱు లేచుచున్నారు.]

విదూ—మిత్రమా! ధైర్యముగా నడువుము. పూజ్యురాలు ధారిణీదేవి అనుమానించఁగలదు.

రాజు—సిద్ధిపథము నధిష్ఠించిన మనోభీష్ట శబ్దమువలె నీ మృదంగవాద్యము ధైర్యము నవలంబించి యున్నను నన్ను మిక్కిలి త్వరపెట్టుచున్నది. (అందఱు నిష్క్ర మింతురు.



# మాళవికాగ్నిమిత్రము

## ద్వితీయాంకము

[సంగీతశాలలో రాజు, విదూషకుఁడు, ధారిణి, కొందఱు పరిజనులు ప్రవేశింతురు.]

రాజు——పూజ్యురాలా! ఈ యుపాధ్యాయులలో ముందు పరీక్షింప వలసిన దెవరి యుపదేశము?

పరి——పాండిత్యము సరిసమాన మైనను వయోవృద్ధుఁడగుటచే గణదాసే ప్రాథమ్యము నందవలయును.

రాజు——అయినచో, మౌద్గల్య! ఈ విషయమును వారిద్వరకును దెలిపి నీ పనిని జూచుకొమ్ము.

కంచు——చిత్తము. దేవరయాజ్ఞ. (నిష్క్రమించును.)

గణ——దేవ! జయదేవ కృతి అష్టపది ప్రదర్శింపఁబడనున్నది. సావధానులరై యాలకింపుఁడు.

రాజు—సావధానముగ నుంటిని. (గణదాసు నిష్క్రమించును.)

రాజు——(జనాంతికము) మిత్రమా! తెరచాటున నున్న మాళవికను దర్శింప నుబలాటపడు నా నయనము లతి చపలములై తెరతీసిపారవేయుట కుద్యుక్తము లైనట్లున్నవి.

విదూ——(ప్రక్కకుఁ దిరిగి) నయనామృతము సమీపించి యున్నది. ఈగలు కూడ ముసురుచున్నవి. కావున జాగరూకుఁడవై త్రాగుము.

[మాళవిక ప్రవేశించును. గణదాసు, మాళ వికయంగసౌష్ఠవమును వీక్షించుచుండును.]

విదూ——(జనాంతికము) తిలకింపుము. సౌందర్యమునకు లవ లేశమైనను లోపము లేదు.

రాజు——మిత్రమా! ఈమెను ఫొటోలోఁ జూచినపుడు కాంతి విషయమై కొంత సంశయ ముండెడిది. ఇపుడు నిస్సం శయ మైనది. ఈ ఫొటో తీసినవాఁ డసాధారణుఁ డనుకొందును.

గణ——అమ్మాయీ! భయపడక ధైర్యముగా నుండుము.

రాజు——(తనలో) ఆహా! ఈ రూప మెంత నిర్దుష్టము. కన్ను లాకర్ణాంతములు. ముఖము శరత్కాల చంద్రబిం బము. బాహువు లానతములు. వక్షము నిబిడోన్నత స్తనము. పార్శ్వములు ప్రమృష్టములు. పిడికిలి కందెడి పరిమితమైన నడుము, అపరిమితమైన జఘనము. ఆకుం చితాంగుళులు పాదములు. నాట్యాచార్యుని భావ వీధివలె నీమె శరీరమెంతయు రమ్యముగ నున్నది.

[మాళవిక శ్రుతిచేసి యష్టపది పాడుచు
రసానుగుణముగ నాట్యము చేయును.]

శంకరాభరణరాగము — రూపకతాళము

* నాథ! హరే! జగన్నాథ! హరే!
సీదతి రాధా వాసగృహే.

విదూ—(ప్రక్కకుఁ దిరిగి) మిత్రమా! వింటివా! ఈయష్ట పదిని సాకుచేసికొని నీయందాత్మార్పణము గావించు చున్నది సుమా!

రాజు—గౌతమ! నేనును నిట్లనుకొనుచుంటిని. ఈమె "నాథ" అని పాడినపాటలోఁ దనకు నాయందుఁ బ్రేమ గలదన్నసంగతి నభినయముద్వారా సూచించు చున్నది. (మాళవిక వెళ్ళఁబోవును.)

విదూ—అమ్మాయీ! ఆగు మాగుము. నీ వొక్క క్రమ భేదమును మఱచితివి. దానిని జెప్పెదను.

గణ—బాలికా! క్షణకాలమాగి తప్పుదిద్దుకొని వెళ్లుము. (మాళవిక వెనుకకు మరలును.)

రాజు—సౌందర్య మన్నిదశలందును శోభాతిశయమును బోషించునుగదా! కంకణయుతమగు వామహస్త మును గటిస్థలముననుంచి, దక్షిణహస్తమును శ్యామావిటపమట్లు జార్చవిడిచి, వేదికపైఁ జూడ్కుల

* ఈ యష్టపది నాటకముచివరఁ జూచునది.

నిగుడించియున్న యీమె సగశరీరము నృత్తము కంటెను మిక్కిలి మనోహరముగ నున్నది.

ధారి—గౌతముని మాటను గూడ యార్యపుత్రుఁడు పాటింపవలసినదేనా?

గణ—దేవి! అట్లనకుము. ప్రభువుల సాంగత్యమున గౌతమునకును నిట్టి సూక్ష్మదృష్టి యబ్బియుండవచ్చును. చూడుఁడు. ఇందూఫల గంధము సోకినంతనే కల్మషోదకము నిర్మలమగునట్లు జ్ఞానహీనుఁడును విచక్షణుల సహవాసమున విజ్ఞాని యగుచున్నాఁడు. (విదూషకునివంకచూచి) ప్రభువులు ప్రశ్నించినది వినఁ గోరెదము.

విదూ—(గణదాసుని జూచి) పరివ్రాజికనే యడుగుఁడు. నేను కనిపెట్టిన పొరపాటు పిమ్మట చెప్పెదను.

గణ—భగవతి! తప్పో, ఒప్పో, చూచినది చూచినట్లుగఁ జెప్పఁగోరెద.

పరి—చూచినంతవఱ కంతయు నిర్దుష్టముగనే యున్నది. పఠనన, వాక్యానుగుణ మగు నవయవ విన్యాసముచే నర్థము చక్కఁగా సూచింపఁబడినది. పాదన్యాసము లయాన్వితమై యొప్పినది. రసవిషయమునఁ దన్మయత చూపఁబడినది. అభినయము మృదుమధురముగ నున్నది. సాంగబంధ మొక్కటియు నైనను నభినయభేదములు చక్కఁగాఁ జూపఁబడినవి.

గణ—ప్రభువు లెట్లు తలంతురో.

రాజు—గణదాస! మేము స్వపక్షాభిమానమును వదలు కొంటిమి.

గణ—దేవ! ఇప్పుడు నాట్యాచార్యుఁడ నైతిని. మంటలోఁ గాల్చినను మలినము నొందని బంగారమువలె పండితులలోఁ గళంకము దెచ్చిపెట్టని యాచార్యుల యుపదేశమే సదుపదేశమని సజ్జనులు పల్కుదురు.

ధారి—అపరీక్షితారాధనముచే నుపాధ్యాయులు వన్నెకెక్కుదురు గాక.

గణ—దేవీస్వీకారము కూడ నా యభివృద్ధికిఁ గారణమే. (విదూషకుని జూచి) గౌతమ! ఇంక నీ మనసులోనిది బయట పెట్టుము.

విదూ—ప్రథమోపదేశప్రదర్శనమునఁ బ్రథమముగ బ్రాహ్మణపూజ కర్తవ్యము. అది మఱచినారు.

గణ—లోకైన ప్రశ్నయే. (అందఱు నవ్వుదురు. మాళవికయు మందస్మిత మొనర్చును.)

రాజు—(తనలో) అస్పష్ట దంతకాంతులు గల యీపె మందస్మిత వదనమును నస్పష్టకేసరములు గల వికసదరవిందమట్లు చూచి యానందించితిని.

గణ—మహాబ్రాహ్మణా! సభ కెక్కుట కిది మొదటిసారి కాదు. లేనిచోఁ బూజ్యులగు మిమ్ములను బూజింపకుందు నెట్లు?

విదూ—శుష్కగర్జనములు గల యంతరాళమున ముగ్ధ చాత
కము జలపాన మభిలషించిన ట్లయినదే.

పరి—అవు నవును.

విదూ—భగవతి! మూఢులు పరప్రత్యయనేయబుద్ధులు
కదా. ఈ మాళవిక గానము సిద్ధష్టమే యగుచో
నీపె కిద్దానిని బారితోషికముగ నిచ్చుచున్నాను.
(అని రాజుచేతినుండి కంకణమును దీయును.)

ధారి—(గణదాసుని జూచి) ఆచార్యవర్య! నీ శిష్యురాలి
యుపదేశప్రదర్శనము పూర్తియైనది.

గణ—అమ్మాయీ! రమ్ము. వెళ్ళుదము. (గణదాసుతో
మాళవిక వెళ్ళును.)

విదూ—(జనాంతికము) నాబుద్ధివైభవ మీపాటిది.

రాజు—కాదు కాదు. ఈపాటి దనకుము. ఆమె వెడలి పోవు
టచే నానేత్రముల యదృష్ట మస్తమించినదనియు హృ
దయానందమున కవసానము వాటిల్లిన దనియు, ధైర్య
మునకుఁ గవాటబంధ మైన దనియు, దలంచెదను.

విదూ—దరిద్రుఁ డాతురుఁడై వైద్యుని యౌషధమును
గోరుచున్న ట్లున్నది.

హర—(ప్రవేశించి) దేవ! మదీయప్రయోగప్రదర్శనము
గూడ, అనుగ్రహింపఁగోరెద.

రాజ—(మనసులో) చూడవలసినది పూర్తియైనది. (ప్రకాశ
ముగ) కౌతూహలాయ త్తచిత్తులముగనే యుంటిమి.

[ తెరలో ]

వైతాళికుఁడు—ప్రభువులకు జయము. మధ్యాహ్నసమయ మాసన్నమైనది. దిగుడు బావులందలి తామరాకుల చాటున హంసలు కన్నులుమూసికొని దాగియున్నవి. ఎండవేడిమిని సహింపలేక పావురములు ప్రాసాదో పరిభాగములఁ బ్రవేశింపకున్నవి. జలబిందువుల నాశించినదై మయూరము ధారాయంత్రపరిసరముల సంచరించుచున్నది. సకలనృపగుణ శోభితులగు ప్రభువులచందమున సహస్రకిరణసహితుఁడై ప్రచండ మార్తాండుఁడు ప్రకాశించుచున్నాఁడు.

విదూ—మిత్రమా ! మనకు భోజనసమయ మాసన్నమైనది. అనియతసమయభోజనము దోషావహమని వైద్యు లందురు. (హరదత్తుని జూచి) తమ రేమందురు?

హర—ఏ మనుటకును దావులేదు.

రాజు—అగుచో మీ యుపదేశమును రేపు చూడఁగలము. తమరు విశ్రమింపుఁడు

హర—ప్రభువులయాజ్ఞ. (వెళ్ళును)

ధారి—ప్రభువులు స్నానాదిక మాచరింతురుగాక.

విదూ—దేవి! భోజనమునకై త్వరపెట్టుము.

పరి—(లేచి) ప్రభువులకు స్వస్తి. (పరివ్రాజిక, ధారిణి, పరిజనులు వెళ్ళుదురు.)

విదూ—మిత్రమా ! రూపమందే కాదు, శిల్పమందును మాళ
        విక యద్వితీయ.

రాజు—గౌతమ ! సహజసుందరి యగు మాళవికను లలిత
        విజ్ఞానవతినిగ సృజించిన విధాతచే మదనబాణము
        విషదిగ్ధము కావింపఁబడినది. ఇన్నిమాట లెందుకు?
        నన్ననుగ్రహించి యాలోచింపవలసిన భారమంతయు
        నీపై నున్నది.

విదూ—నా విషయమై నీవును నంతే. గాలిలేని కందుక
        మట్లు నాకడుపుఁ బట్టుకొని పోవుచున్నది.

రాజు—నావిషయమై నీవును నిట్లే త్వరపడవలయు సుమా.

విదూ—అట్లే కాని, మబ్బుమాటునదాగిన వెన్నెలవలె మాళ
        విక పరాధీనయైయున్నది. ఆమిష మభిలషించియు,
        పిరికితనమున నంతరాళమందే సంచరించెడి గ్రద్దవలె
        నీవున్నావు. కావునఁ గార్యసిద్ధికై తొందరపాటు తగ
        దని మనవి.

రాజు—మిత్రమా ! ఎట్లు తొందరపడకుందును. సర్వాంతః
        పురవనితావ్యాపారప్రతినివృత్తహృదయుఁడ నగు
        నాప్రేమభావమున కా వామలోచన యొక్కతెయే
        నిలయమైయున్నది. (నిష్క్రమింతురు.)



# మాళవికాగ్నిమిత్రము

## తృతీయాంకము

[సమాహితిక ప్రవేశించును]

సమా—దేవి కుపాయనముగా బీజపూరకమును దీసికొని రమ్మని పరివ్రాజిక యాజ్ఞాపించినది. కావునఁ బ్రమద వనపాలికయగు మధుకరికను వెదకెదను. (పరిక్రమించి చూచి) తపనీయాశోకమును జూచుచు మధుకరిక యిచ్చటనేయున్నది. సమీపించెదను. (దగ్గరకువచ్చి) మధుకరికా! నీ కీ తోటపని సుఖముగనున్నదా ?

మధు—ఓహో ! సమాహితికా ! సఖి ! స్వాగతము.

సమా—చెలీ ! "రిక్తహస్తములతో దేవిని దర్శింపరాదు. కావున బీజపూరకముచే సేవింపఁగోరుచున్నా" నని పరివ్రాజిక యాజ్ఞాపించినది.

మధు—బీజపూరక మిచటనే యున్నదిలే. పరస్పర విజిగీషువులైన యాచార్యులలోఁ బరివ్రాజిక ప్రశంసించిన దెవరిని ?

సమా—ఇద్దరును సరిసమాను లఁగుపండితులే. బోధకులే. అయినను శిష్యురాలి గుణగణముచే గణదాసే విశేషముగఁ బ్రశంసింపఁబడినాఁడు,

మధు—మాళవికనుగూర్చి యేమనుకొనుచున్నారు ?

సమా—ప్రభువు లామెను గాఢముగఁ బ్రేమించినారు. అయి
నను ధారిణికి వెఱచితమమమకారమునుజూపుటలేదు.
మాళవిక కూడ యిన్ని దినములనుండియు ధృతపరి
త్యక్తయగు మాలతీమాల వలె వాడి కృశించిపోవు
చున్నది. ఇంతకంటె మిక్కిలి నాకునుదెలియదు.
నన్నుఁ బోనిమ్ము.

మధు—ఇదిగో! ఈ కొమ్మను వ్రేలాడుచున్న బీజపూరక
మును దీసికొమ్ము.

సమా—(తీసికొని) సఖీ! నీవును నితోధికసాధుజన శుశ్రూ
షాఫలము ననుభవింపుము. (బయలుదేరును.)

మధు—సఖీ! కలసియే వెళ్లుదము. నేనును "ఈ యశోక
మెంతటికిని బుష్పింపకున్న దనియు, దోహద మావ
శ్యకమనియు" దేవికి విన్నవింతును.

సమా—అవును. ఇది నీ బాధ్యత కదా! [ఇద్దరు వెళ్లుదురు.]

[మదనావస్థతో రాజు, విదూషకుఁడును బ్రవేశింతురు.]

రాజు—(తన్ను జూచుకొని) ఆ ప్రియురాలి యాలింగన
సుఖము లేకుండుటచే నా శరీరము సన్నగిలుచున్నది.
క్షణమైనను నామె యగపడనిచోఁ గన్ను లశ్రుపూరి
తము లగుచున్నవి. హృదయమా! ఆ సారంగాక్షిని
గలసియే యుంటివి. క్షణ మైనను విడనాడ కుంటివి.
నిర్వాణమే ప్రసక్తమగుచుండఁగా నీకీ పరితాప మేల?

విదూ.—అయ్యో! ధైర్యమును వీడి దీనముగ విలపించుట చాలును. మాళవిక యనుంగు చెలికత్తెను వకుళావళి కను జూచివచ్చితిని గదా! నీ సందేశ మంతయు వినిపించితిని గూడ.

రాజు—ఆమె యే మన్నది?

విదూ.—ఇట్లన్నది. "ఈ నియోగముచే ననుగ్రహింపఁబడితిని. కాని నాగసంరక్షిత మగుమణి వలె ధారిణీపరాయత్త యగు మాళవిక సులభసాధ్యమాత్రము కాదు. అయినను బ్రయత్నించి కూర్చెదను." అని.

రాజు—భగవంతుఁడా! మన్మథా! ప్రతిబంధయుతము లగు విషయములందును బట్టుదలతోఁ దాళఁజాలని రీతిఁ బ్రహరించెద వేల? (ఆశ్చర్యముతో) మన్మథ! హృదయవిదారక మగు నా వ్యాధి యెక్కడ? విశ్వసనీయ మగు నీ యాయుధ మెక్కడ? "మృదువు తీక్ష్ణము" అను మాట నీయందే కానవచ్చుచున్నది.

విదూ.—మిత్రమా! ఆ విషయమై పన్నాగ మొక్కటి పన్నితి నని చెప్పుచుంటినిగదా! ఇఁక దిగు లొందకుము.

రాజు—ఈ పగలంతయు నుచిత వ్యాపారవిముఖ మగు మానసంబున గడుపవలెఁ గదా!

విదూ.—కురవకపుష్పము లుపాయనముగఁ దెచ్చి వసంత విహారమున కిరావతీదేవి కబురంపిన ట్లిప్పుడే కదా

నిపుణిక నిన్నుఁ బ్రార్థించి వెళ్ళినది. అందుకు నీవును సమ్మతించితివి కదా! కావునఁ బ్రమదవనమునకే పోవుదము.

రాజు—వద్దు. ఇప్పుడు మాత్రి మది కూడదు.

విదూ—ఎందువలన ?

రాజు—మిత్రమా! ఆడువార లసలే జాణలు. మాళవికా లోలుఁడ నగు నన్ను నీ నెచ్చెలి యిరావతి కని పెట్టలే కుండునా? ఇరావతీప్రార్థనము త్రోసిపుచ్చుటయే యుక్తము. కారణకలాప మంతయు నగ్లీ యగపడుచున్నది. మానవతుల యుపచారవిధితోల్లింటికంటె మిన్నగ నున్నను భావశూన్యముగ మ్మాత్ర ముండదు.

విదూ—అయ్యో! అంతఃపుర ప్రేమ నంతయు నొక్క మాఱుగఁ దుడిచిపెట్టుట తగదు సుమా!

రాజు—(ఆలోచించి) సరే. ప్రమదవనమార్గ మాదేశింపుము.

విదూ—ఇటు. ఇటురండు. (వెళ్ళుదురు.)

విదూ—పవనచలితములగు పల్లవాంజలులతో నిన్ని వసంతము ప్రమదవన ప్రవేశమునకుఁ ద్వర పెట్టుచున్నది.

రాజు—(స్పర్శనుసటించి) ఓహో! వసంతుఁ డభిజాతుఁడు కదా. మిత్రమా! చూడుము. మదించిన కోకిలల శ్రుతిసుభగ కూజితములచే నా మదనవ్యాధిసహ్యత

నడుగుచు, చూతమంజరీపరిమళమిళిత దక్షిణానిల మును గరతలస్పర్శవలె నా తనువున సోకున ట్లొనర్చుచున్నాఁడు.

విదూ—సుఖముగ ననుభవింపుము.

[ఇర్వురును బ్రవేశింతురు.]

విదూ—మిత్రమా! శ్రద్ధగాఁ జూడుము. నిన్ను లోభ పెట్టుట కన్నట్లుగ నీ ప్రమదవనలక్ష్మి, యువతీవేష మునకు సయితము సిగ్గును బుట్టించెడి వసంతనేపథ్య మును ధరించినది.

రాజు—(ఆశ్చర్యముతో) చూచుచున్నాను. బింబాధర మం దలి లత్తుక రక్తాశోకలతలచే ద్విగుణితమైనది. త్రివర్ణ యుతకురవకము విశేషకమును దిరస్కరించుచున్నది. ద్విరేఫాంజనము లగు తిలకములు తిలకక్రియ నధిగ మించినవి. వసంతలక్ష్మియువతీముఖాలంకరణ విధా నమం దీర్ష్యకలదివలె నున్నది. (అని యుద్యాన శోభను వర్ణించుచుందురు.)

[ప్రత్యుత్సుక యగు మాళవిక ప్రవేశించును.]

మాళ—హృదయమును గమనింపక ఆర్యపుత్రుని బ్రేమించి నందుకు నాలో నాకే సిగ్గగుచున్నది. చెలికత్తెల కీ సంగతి తెల్పునంతటి యదృష్టముకూడ లేదు. ప్రతి క్రియాశూన్య మగు నీవ్యాధితో మదనుఁ డెంత కాలము నన్ను బాధింపఁగలఁడో యెఱుఁగను.

(కొన్ని యడుగులు నడచి) ఎక్కడకు బయలుదేరి తిని? (ఆలోచించి) ఆ. దేవియాజ్ఞ యైనది. "గౌతమ చాపలముచే నూయెలనుండి క్రిందపడుటచే నాకాలు నొప్పి పట్టినది. నీవు వెళ్ళి తపనీయాశోకమునకు దోహద మొనర్పుము. అది యయిదు రాత్రులలోఁ బుష్పించినచో (నిట్టూర్పువిడిచి) యభీష్టమును బూరించెదను." అని అచటకే పోయెను. చరణాలంకారములఁ గైకొని వకుళావళికయు నా వెంటనే రావలసియున్నది. కావున నిటనే క్షణకాల మాగియుందును.

విదూ—(చూచి) మిత్రమా! ఇదిగో. సీధుపానోద్వేజితునకు, చక్కెర దొరకినది.

రాజు—గౌతమ! ఏమది?

విదూ—ఇదిగో. పరిమితాభరణములఁ దాల్చి యుత్సుకచిత్తయై మాళవిక యిచటనే యున్నది.

రాజు—(సంతోషముతో) మాళవికయా?

విదూ—అవును.

రాజు—జీవితమున కొక్కింత యాధారము దొరకినది. పిపాసాతురుఁడు తరుపరివృతస్రోతస్వినిని సారసరావముచేఁ గన్గొనినట్లు "ప్రియురాలు సన్నిహితురాలే" యని నీనుండి తెలిసికొని నా విషణ్ణహృదయము వికసించినది. సరే. నా మాళవిక యెక్కడ?

విదూ——ఆ చెట్లతోపునుండి యిటకే వచ్చుచున్నట్లున్నది.

రాజు (చూచి, సంతోషముతో) మిత్రమా! చూచితిని.
కటిస్థలమున విపులమై, నడుమున సన్నగిలి, కుచముల
నున్నతమై, నేత్రముల నత్యాయతమై నా జీవిత
సర్వస్వ మిదే వచ్చుచున్నది. మిత్రమా! వెనుకటి
కంటెఁగూడ నందముగఁగన్పడుచున్నదే. తెల్లుపూల
వలె తెల్లని చెక్కిళ్ళతో పరిమితాభరణధారిణి యైన
యీమె, పండుటాకులు గల్గి పరిమితకుసుమధారిణి
యగు వసంతకుందలత వలెనే ప్రకాశించుచున్నది.

విదూ——ఈమెయు నీ వలెనే యస్వస్థగా నున్నట్లున్నదే?

రాజు——మిత్రమా! నీ సౌహార్ద మట్లనిపించుచుచున్నది.

మాళ——లలితదోహద మపేక్షించి పుష్పింపక నావలెనే
యున్న యశోకవృక్ష మిదియే. ఈ నీడనున్న శిలా
పట్టమునధిష్ఠించి వినోదించెదను.

విదూ——వింటివా? మిత్రమా! ఉత్సుకచిత్త నయితి ననిపలుకు
చున్నది.

రాజు——నీ యూహ సరియైన దని తలంపను. ఏమన. కురవక
రజముల వెదజల్లుచుఁ గిసలయశీకరవశంవదమై వీచెడి
యీ మలయమారుతము నిష్కారణముగనే ఔత్సు
క్యము గలిగించును.

(మాళవిక సమాసీన యగును.)

రాజు——మిత్రమా! ఇటు రమ్ము. ఈ తీగలమాటున దాగి
యుందము,

విదూ—ఏమీ! ఇరావతి సమీపించుచున్నదా?

రాజు—కమలాకరముఁ జూచిన మతంగజము మొసలికి వెఱచునా? (అని చూచుచుండును.)

మాళ—హృదయమా! సంభవమే లేని కోరికలను జాలింపుము. నన్నాయాసపెట్టి యేమి లాభము?

(విదూషకుఁడు రాజును జూచును.)

రాజు—ప్రియురాలా! ప్రేమయొక్క వక్రతను బరికింపుము. నీ యుత్సాహమునకుఁ గారణము తెలియదు. తెలిసికొందమన్నను నూహాపరంపర, తత్త్వనిరూపకము కాఁజాలదు. అయినను నీపరిదేవనములకు నేనే లక్ష్యమని తలపోయుచున్నాఁడను.

విదూ—ఇప్పుడు నీకు నిస్సంశయమగునులే. వకుళావళిక రహస్యముగ నీమెను జేరుచున్నది. మదనసందేశమిదివఱకే యామెకుఁ దెల్పితిమి కదా!

రాజు—మనమాట దీనికి జ్ఞాపక ముండునా ?

విదూ—ఈ దాసీరండ నీ సందేశమును గూడ మఱచిపోవునుగా? నేనే మఱచిపోనుగదా.

[చరణాలంకారములతో వకుళావళిక ప్రవేశించును.]

వకు—సఖీ ! కుశలమే కదా !

మాళ—ఓహో ! వకుళావళికా ! స్వాగతము. కూర్చుండుము.

వకు—సఖీ! నీ యోగ్యతవలననే ధారిణి యీ పనికి నిన్ను నియమించినది. ఏదీ! ఒకపాద మిటు పెట్టుము. పారాణిపెట్టి నూపురము తొడిగెదను.

మాళ—(తనలో) హృదయమా! వైభవ మొరిగిన గ్లెందుల కీయుబలాటము. ఇప్పు డే నెట్లు తప్పించు కొందును. అథవా. ఇది మరణాలంకారమును గాఁగలదు.

వకు—ఆలోచించెద వేమి? ఈ యశోకపుష్పసందర్శనము నకు దేవి మిక్కిలి కుతూహలచిత్తయైయున్నది.

రాజు—ఏమీ! అశోకదోహదముకొఱకా యీ ప్రయత్నము?

విదూ—మఱి నీ వేమనుకొనుచుంటివి? నాపన్నుగడకారణముగ దేవి యీమె నంతఃపురమునఁగూడ చేర్చుకొనఁగలదు.

మాళ—సఖీ! అపరాధమును సైరింపుము. (పాదమందిచ్చును.)

వకు—సఖి! నా శరీరమవేకదా నీవు. (పాదము నలంకరించును.)

రాజు—మిత్రమా! చరణాన్తనివేశిత మగు రాగరేఖను జూడుము. హరదగ్ధ మనోభవద్రుమపల్లవప్రసూతి వలె నలరారుచున్నది.

విదూ—చరణానుగుణ మగు పనియే విధింపఁబడినదిలే.

రాజు—చక్కఁగాఁబల్కితివి. లేఁజిగుళ్ళవలె నెఱ్ఱని నఖ కాంతులుగల యీ పారాణిపాదముతో మాళవిక దోహదాపేక్షచేఁ బుష్పింపకున్న యీ యశోకమును, సద్యఃకృతాపరాధమునఁ బ్రణమితశిరస్కుఁడనగు నన్ను మా యిర్వురనుగూడ పాదతాడనముచేయఁదగి యున్నదిసుమా !

విదూ—అపరాధివగు నిన్నుఁదన్నియే తీరునయ్యా !

రాజు—యథార్థమగు బ్రాహ్మణవచనమును శిరసావహింతును.

[ఇరావతి, చేటియుఁ బ్రవేశింతురు.]

ఇరా—సఖి ! నిపుణికా! మద్య మబలల కలంకారమందురు. నిజమేనా ?

నిపు—మొదట లోకోక్తియైనను నిప్పుడు యథార్థమే యైనది.

ఇరా—నాపైఁ బ్రేమచే మాట్లాడవద్దు. ప్రభువులు డోలా గృహమును బ్రవేశించినారని తెలిసినది ?

నిపు—మీ యఖండితప్రణయానుబంధముచేతనే !

ఇరా—ఎట్లు? దాసీభావము వలదు. మధ్యస్థురాలవై చెప్పుము.

నిపు—వసంతోపాయనలాలసుఁడగు నార్యగౌతముఁడు తెల్పినాఁడు,

ఇరా—(కొంచెమునడచి) సఖి! మద్యపానముచే దూలిపోవు చుంటిని. ఆర్యపుత్రసందర్శనముకై త్వరపడుచుంటిని. నడక సాగకున్నది.

నిపు—అమ్మా! డోలాగృహమునకు రానే వచ్చితిమి.

ఇరా—నిపుణికా! ప్రభువులు కనఁబడరేమి ?

నిపు—మీరే చూచుకొనుఁడు. పరిహాసనిమిత్తమై యెట నైన దాగియుండిరేమో? మన మైనను నీప్రియంగు లతాక్షిప్త మగు నశోకశిలాపట్టము నధిష్ఠించి కూర్చుందము.

(ఇరావతి కూర్చుండును.)

నిపు—(ముందుకు నడచి, చూచి) అమ్మా! చూడుము. లేమావికిసలయములఁ గోయుచున్న మనలను జీమలు కుట్టినవి.

ఇరా—ఏమి?

నిపు—ఈ వకుళావళిక యశోకతరుచ్ఛాయ నున్న మాళవికకుఁ జరణాలంకారము నెఱవేర్చుచున్నది.

ఇరా—(శంకించి) ఇక్కడ మాళవిక యెట్లున్నది.? నీ వెట్లు తెలిసికొంటివి?

నిపు—ఊయెలనుండి పడుటచే, కాలికి దెబ్బ తగిలి ధారిణీ దేవియే మాళవిక నశోకదోహదాధికారమున నియమించియుండు నని తలంచెద. లేనిచో ధారిణి ధరించెడి నూపురయుగళము పరిజనుల కెట్లు వచ్చును?

ఇరా—నీ యూహ సరియైనదే.

నిపు—ప్రభువుల నన్వేషింప రేమి?

ఇరా—సఖీ! నాకుఁ గాల్లాడుట లేదు. మనస్సు కూడ కలఁత నొందుచున్నది. అనుమానము నిస్సంశయము కావలెను. (మాళవికను జూచి, తనలో) నా డెందము కొందల మొందుట సమంజసముగనే యున్నది.

వకు—(మాళవికకుఁ బాదమును జూపుచు,) ఈతీరు పారాణి నీ కిష్టమే యగునా?

మాళ—నా చరణము కదా యని స్తుతించుటకు లజ్జించు చున్నాను. ఈ కళ యెవరియొద్ద నభ్యసించితివి?

వకు—ఈ విషయమున, ప్రభువులకే శిష్యురాలను.

విదూ—గురుదక్షిణకోసము త్వరపడవయ్యా.

మాళ—పాపము. గర్వము మాత్రము లేదు.

వకు—ఉపదేశమునకుఁ దగిన చరణము లభించిన దని యిప్పుడు గర్వించుచున్నాను. (తనలో) అబ్బా. నా దూత కృత్యము సిద్ధించినది. (ప్రకాశముగ)సఖి! ఈపాదము నకుఁ బారాణి పెట్టుట పూర్తి యయినది. కొంచెమారఁ బెట్టుకొమ్ము. వద్దులే. గాలి వీచుచునే యున్నదిలే.

రాజు—మిత్రమా! చూడుచూడుము. ఆర్ద్రాలక్తక మగు నీమె చరణమును ముఖమారుతముచే విసరుటకుఁ దగిన యవకాశ మిప్పుడు నాకు లభించినది.

విదూ—నీకీ పరితాప మేల? ఇదే వరుసగఁ జాలకాలము నీ వనుభవింప వలసియున్నది.

వకు—సఖి! నీపాద మరుణశతపత్ర మట్లు ప్రకాశించుచున్నది అన్నివిధముల భర్తృసన్నిహితవర్తినివి కమ్ము.

[ఇరావతి నిపుణికను జూచును.]

రాజు—నా కిది యాశీర్వాదము సుమీ!

మాళ— సఖి! అసందర్భాలాపములు వలదు.

వకు—పలుకవలసిన మాట పలికితిని.

మాళ—నీ కిష్టసఖిని గదా.

వకు—నాకే కాదు.

మాళ—ఇంకెవ్వరికి?

వకు—గుణాభినివేశము కల ప్రభువులకుఁ గూడ.

మాళ—అబద్ధము లాడుచున్నావు. అదే నాయెడఁ బూజ్యము

వకు—నిజమే: నీయెడఁ బూజ్యమే. కేవలము పాలిపోయిన ప్రభువుల కృశాంగములందు మాత్ర మగపడుచున్నది.

నిపు—ఈ దాసీరండ సమాధానము, చూచిచెప్పి నట్లున్నది.

వకు—అనురాగ మనురాగముచేతనే పొందవలె ననెడి సజ్జన వచనమును సార్థక మొనర్పుము.

మాళ—నీ యభిప్రాయానుసారముగ మాట్లాడుచుంటివా?

వకు—లేదు లేదు. ప్రణయమృదులము లగు నీ యక్షరములు ప్రభువుల ముఖమందు దాగియున్నవి.

మాళ—సఖీ! ధారిణిని దలపెట్టినపు డెల్ల నా కేమియుఁ బాలు పోకున్నది.

వకు—అమాయికురాలా! తుమ్మెదలు వ్రాలు నని వసంత సర్వస్వ మగు చూతప్రసవము నలంకరించుకొనుట మానుకొందురా?

మాళ—నీవుమాత్రము నన్ను గష్టకాల మందాదుకొనవలె సుమా.

వకు—రాపిడి కలిగిన కొలఁదిని బరిమళించెడి వకుళావళికను గదా.

రాజు—మంచిది. వకుళావళికా! మంచిది. భావమును గుర్తించి, ప్రత్యాఖ్యానముతో నీమెను నా నిదేశమున స్థాపించితివి. కాముకుల ప్రాణములు దూత్యాధీనము లనుట సత్యమేకదా.

ఇరా—సఖీ! చూడుము. వకుళావళిక మాళవికను భ్రభువుల కనురక్తురాలినిగఁ జేయనేచేసినది.

నిపు—అమ్మా! చెప్పుడుమాట లమాయికులను సయితము చెఱచునుగదా!

ఇరా—నాహృదయము శంకించుట సరిగనే యున్నది. బాగుగఁ దెలిసినపిమ్మట నాలోచించెదను.

వకు—ఈ ద్వితీయపాద మలంకరించుటయుఁ బూర్తి యయినది. ఇఁక నూపురములఁ దొడిగెద. (తొడుగుచు) సఖీ! లెమ్ము. అశోకమును బుష్పింపఁజేసెడి దేవీ నియోగము నాచరింపుము. (ఇరువురు నిలుచుందురు)

ఇరా—వింటివా ! దేవీనియోగ మిట్టి. కానిమ్ము.

వకు—ఉపారూఢరాగము, నుపభోగక్షమము నగు నిది నీ యెదుటనే యున్నది.

మాళ—(హర్షముతో) ప్రభువులదర్శనమా ?

వకు—(చిఱునవ్వుతో) రాజదర్శనము కాదు. అశోకశాఖావలంబియగు పల్లవగుచ్ఛము. దీని నలంకరించుకొమ్ము.

(మాళవిక విషాదమును నటించును.)

విదూ—మిత్రమా ! వింటివా ?

రాజు—సఖా ! కాముకుల కీమాత్రము చాలును. అరాతురోత్కంఠితల సమాగమము సిద్ధించినను ప్రేమ జనింపదు. పరస్పరప్రాప్తినిరాశు లగు సమానురక్తుల శరీరములుబాసినను గొంతనయము. (పల్లవముల నలంకరించుకొని మాళవిక లీలగా నశోకతాడనముకై పాదమును జాపును.)

రాజు—మిత్రమా ! చూడుము. ఈమె తరుకిసలయ మందుకొని దానికి బదులుగ జరణ మర్పించుచున్నది. మా రెండింటికిని బోలికయే లేదు. నేనే వంచితుఁడనైతిని.

మాళ—దోహద మాశించి మొగ్గతొడుగుట మానివైచిన యీ యశోక మెంతగడుసరి ? ఇప్పటి మా సంభావన సఫలమగునా ?

వకు—సఖీ ! అది నీదోషముకాదు. నీచరణ సత్కారమందియుఁ బుష్పింపనిచో నయ్యది యశోకదోషమే యగును.

రాజు—ఓ యశోకమా ! ఘల్లుఘల్లుమ్రోగు నూపురారావముగల మాళవికాచరణారవిందముచే సత్కరింపఁబడియు వెంటనే మొగ్గతొడుగకయున్నచో లలితకామినీ సాధారణమగు దోహదప్రక్రియను వ్యర్థమొనర్చెదవు. మిత్రమా ! ఏదేని మాటఁగలుపుచుఁ బ్రవేశింపఁ గోరుచున్నాను.

విదూ—ఈసమయమున నీమెను బరిహసింపఁ జేయుదము.

[ఇర్వురును బ్రవేశింతురు.]

నిపు—అమ్మా ! రాజుగారిచ్చటకే వచ్చుచున్నారు.

ఇరా—మొదటనే యూహించితిని.

విదూ—(సమీపించి) భగవతీ ! ఈ మహాభాగునకుఁ బ్రేమాస్పదమైన యీ యశోకమును వామచరణమునఁ దన్నుటతగునా ?

ఇద్దఱు—(భయముతో) ఓహో ! రాజుగారు.

విదూ—వకుళావళిక ! సంగతిసందర్భమంతయు నెఱింగిన నీవుకూడ యీ యవినయమును వారింపవేమి ?

(మాళవిక భయపడును.)

నిపు—అమ్మా ! ఆర్యగౌతముని వైఖరిఁ జూడుము.

ఇరా—ఈ బ్రాహ్మణోత్తముఁడు నేనేకవిధముగ నెట్లు జీవింపఁగలఁడు ?

వకు—ఆర్య ! ఈమె దేవీనియోగము నాచరించుచున్నది. ఈ విషయమున యీామె పరాధీన యగుటంజేసి ప్రభువు లనుగ్రహింపవలెను.

(అని యిర్వురును నమస్కరింతురు.)

రాజు—సరి. అయితే యీామె తప్పులేదులే. కల్యాణి ! లెమ్ము. (అని హస్తముతో లేవఁదీయును.)

విదూ—బాగున్నది. ఈ విషయమున దేవి మన్నింపఁదగినదే.

రాజు—(నవ్వుచు) కల్యాణి ! కిసలయముంబోలిన నీ మృదుచరణమునకుఁ బాదపతాడనమున బాధకలుగలేదు కదా !

(మాళవిక సిగ్గుపడును.)

ఇరా—(అసూయతో) ఓహో! ఆర్యపుత్రుని హృదయము వెన్నకంటెను సున్నితమునుమా!

మాళ—వకుళావళికా ! మనపని పూర్తి యైనది. దేవికి విన్నవింతము రమ్ము.

వకు—అయితే వదలిపెట్టుఁడని ప్రభువులకు విన్నవింపుము.

రాజు—కల్యాణి ! వెళ్ళుదువుగాని. అవసరప్రాప్త మగు నా యభ్యర్థన నాలకింపుము.

వకు—శ్రద్ధఁగా వినుము. ప్రభువు లాజ్ఞాపించుచున్నారు.

రాజు—ఇతఁడు కూడ చాలదినములనుండియు ధృతికుసుమ
మునుబుష్పింపకున్నాఁడు. అనన్యాభిలాషకలయితనికిని
స్పర్శామృతముచే దోహద మొనర్పఁ గోరెద.

ఇరా—(హాఠాత్తుగ వచ్చి) దోహదమొనర్పుము. ఒన
ర్పుము. అశోకముపుష్పింపకున్నను నితఁడు మాత్రము
పుష్పించును. ఫలించునుగూడ.

(అందఱు ఇరావతినిజూచి సంభ్రాంతులయ్యెదరు.)

రాజు—(ప్రక్కకుఁ దిరిగి) మిత్రమా! ఇప్పు డేమిటి కర్త
వ్యము?

విదూ—ఏ మున్నది? పిక్కబలమే.

ఇరా—వకుళావళిక! నీ వరుస బాగుగనే యున్నది. మాళ
వికా! ఆర్యపుత్రుని యభ్యర్థనము సఫల మొన
ర్పుము.

ఇద్దఱు—దేవి! అనుగ్రహింపవలెను. ప్రభువుల ప్రణయపరి
గ్రహమునకు మే మెంతవారము? (వెళ్ళుదురు.)

ఇరా—అహా! పురుషు లవిశ్వసనీయులు గదా! వ్యాధగీత
లాలస మగు హరిణము వలె నేను నిశ్శంకముగ
నుంటిని.

విదూ—(జనాంతికముగ) ఏదేని సమాధానము చెప్పవయ్యా!
కన్నము వేయుటలో నారి తేరితి నని చెప్పుము.

రాజు—సుందరి! మాళవికతో నా కేమియుఁ బనిలేదు. నీ
రాక యాలస్య మగుటంజేసి యింతలో నీమెతో
నేదియో కాలక్షేపము చేయుచుంటిని,

ఇరా—నమ్మవచ్చును. ప్రభువుల కిట్టి కాలక్షేపవస్తువు లభించిన దని యెఱుఁగను. లేకున్న తెల్వితక్కువదాన నిట్లు రాకయే పోదును.

విదూ—దేవరవారి దాక్షిణ్యమున కుపరోధము గల్పింప కుము. చెంతనున్న పరిచారికను బలుకరించుట కూడ తప్పే యగుచో—నింక విగా చిత్తము.

ఇరా—పల్కరించుకోవచ్చునోయీ! నా కెందుల కీ సంతాపము. (కోపముతో బయలుదేరును.)

రాజు—(అనుసరించుచు) దేవీ! ప్రసన్న వగుము.

[ఇరావతి పోవుచునే యుండును.]

రాజు—సుందరి! ప్రియజనుల నుపేక్షించుట పాడి కాదు.

ఇరా—శఠుఁడ! జన్మలో నమ్మరాదు.

రాజు—చిరపరిచితుఁడ నగునన్ను "శఠుఁడ" యని నిందించిన నిందింతువు గాక. నీ పాదములపైఁ బడి బ్రతిమాలుచున్నదికదా యీ మేఖల. కోపమును విడువవేమి?

ఇరా—ఈ పాడుమేఖలయు నిన్నే యనుసరించుచున్నది. (అని మేఖలతో రాజును గొట్టఁబోవును.)

రాజు—మేఘపంక్తి విద్యుద్దామముచే వింధ్యాద్రిని వలె నీ యిరావతి కన్నీరు మున్నీరుగ నేడ్చుచుఁగటిస్థలము నుండి యాదృచ్ఛికముగ జారిపడిన బంగారుమొలత్రాఁటితో నన్నుఁ గొట్టుటకు సంసిద్ధ యగుచున్నది.

ఇరా—ఇంకను నన్నే అపరాధినిగాఁ జేయుచుంటివా ?

(అని మేఖలను జేతఁ బుచ్చుకొనును.)

రాజు—ఓ సుందరీ! అపరాధుండ నగు నన్ను దండించుట మానివైచె దేల? గినుక చెందుటయు నందముగనే యున్నది. ఇదిగో. (పాదములపైఁ బడును.)

ఇరా—మీ హర్షదోహదమును బూరించెడి మాళవికా చరణములు కావివి. (అని చేటితో నిష్క్రమించును.)

విదూ—ఇంక లేవయ్యా! అనుగ్రహించినదిలే.

రాజు—(లేచి, యిరావతిని గానక) ఏమి? ప్రియురాలు వెళ్ళిపోయినదా ?

విదూ—మిత్రమా! ఆగ్రహముతోనే వెళ్ళినది. అంగారకమువలె కొంప లంటించక మునుపే, మన మిట నుండి శీఘ్రముగ బయలుదేరుదము.

రాజు—అహా! ఏమి యీ మదనప్రభావము? మాళవికాయత్త చిత్తుండ నగుటంజేసి యిరావతి యొనర్చిన ప్రణిపాతలంఘనము ననుకూలసేవనుగ భావించెదను. రాగక్రోధములు రెండును గల యిరావతి నెప్పుడైనను వశపఱచుకొనఁగలను.

(నిష్క్రమింతురు.)



# మాళవికాగ్నిమిత్రము

## చతుర్థాంకము

[పర్యుత్సుకుఁడై రాజు ప్రతీహారియుఁ బ్రవేశింతురు.]

రాజు—(తనలో) శ్రుతిపథగత యగు మాళవిక నాశ్రయించి యాశచే మూలమేర్పఱుచుకొని దృగ్గోచర మైనంత మాత్రముననే యంకురితరాగప్రవాళమై కరతల స్పర్శచే ముకుళితమైన ట్లున్న యీ మనసిజతరువు నన్ను ఫలభోక్తనుగఁ జేయును గాక. (ప్రకాశముగ) గౌతమా!

ప్రతీ—ప్రభువులకు జయము. గౌతముఁ డిచ్చట లేఁడు.

రాజు—(తనలో) అవును. మాళవికావృత్తాంతము దెలిసి కొనుటకు నేనే పంపియుంటిని.

విదూ—ప్రభువులకు విజయము.

రాజు—జయసేనా! ధారిణీదేవి యెచ్చట నున్నదో, కాలు నొప్పియెట్లున్నదో తెలిసికొని రమ్ము.

జయ—చిత్తము.

రాజు—గౌతమా! నీ యనుంగుచెలికత్తియ వృత్తాంత మెట్లున్నది?

విదూ—పిల్లికంటఁబడిన కోకిలవృత్తాంత మెట్లుండును?

రాజు—(విషాదముతో) ఎట్లూ!

విదూ—పాప మా చిన్నది పింగళాక్షియగు నాదేవిచే సార భాండభూగృహమందు మృత్యుముఖమందువలె దాచఁబడి యున్నది.

రాజు—నా సంబంధము నెఱింగియేనా?

విదూ—అవును.

రాజు—గౌతమ! దేవి కింతటి వైమనస్యము గల్పించఁగల ప్రతికూలుఁ డెవఁ డున్నాఁడు మనకు?

విదూ—వినుఁడు. పరివ్రాజిక నాతోఁ జెప్పినది. నిన్న ఇరావతీదేవి, రుజాక్రాంత యగు ధారిణిని జూడఁ బోయిన దఁట.

రాజు—తెరువాత

విదూ—అప్పు డామె యిరావతి నడిగిన దఁట. "ప్రభువులు కన్పించినారా" అని. ఆమె చెప్పిన దఁట. "ఏ మమ్మా! మీ వేళాకోళము. పరిచారికాహృదయసంక్రాంతుఁ డగు నార్యపుత్రుని నెఱింగియు నడుగుచున్నావు." అని.

రాజు—ఓహో! ఈ విషయమంతయు మాళవికయందలి అనుమానముతోనే. తరువాత?

విదూ—పిమ్మట ధారిణి బ్రతిమాలుకోఁగా జరిగిన దంతయు నిరావతి తెలియఁజెప్పిన దఁట.

రాజు—ఏమి? ఇరావతికోప దైర్ఘ్యము? తరువాత చెప్పుము.

విదూ—తరువాత నేమున్నది ? మాళవికావకుళావళికలు బందీకృతలై యసూర్యంపశ్యలుగఁ బాతాళవాసమును నాగకన్యక లట్లనుభవించుచున్నారు.

రాజు—ఎంతకష్టము. మృదుమధురస్వరముతోఁ గోకిలయు, తుమ్మెదయును గలసి వికసితచూత మధిష్ఠించియు, నకాలవర్షముచేఁ గోటరమందే కాలక్షేప మొనర్చుచున్నవి. మిత్రమా! దీని కేమైన నుపాయములేదా?

విదూ—ఎట్లుండును ? ఆ భూగృహమం దున్న మాధవికనుఁగూడ ధారిణి యాజ్ఞాపించినదఁట. "నా యుంగరమునుజూడక దో మాళవికావకుళావళికలను వదలఁగూడ"దని.

రాజు—(నిట్టూర్పువిడిచి) మిత్రమా ! ఏమి టిప్పుడు ప్రతిక్రియ ?

విదూ—(ఆలోచించి) దీనికొక్క చక్కనియుపాయ మున్నదిలే.

రాజు—ఏమది ?

విదూ—(దృష్టిక్షేపముతో) ఎవరైన విందురేమో ? చెవిలోఁజెప్పెదను. (దగ్గరకుఁ దీసికొని ఈ-తీ-రు-గా. (అని చెప్పును.)

రాజు—(సంతోషముతో) బాగుగ నాలోచించితివి. కార్యసిద్ధికై ప్రయోగింపుము.

ప్రతీహారి—(ప్రవేశించి) దేవ! దేవి ప్రవాతశయ్య నధిష్ఠించి పరిజనకరగతచరణయై పరివ్రాజిక చెప్పెడి కథల నాకర్ణించుచుఁ గాలక్షేప మొనర్చుచున్నది.

రాజు—మనము వెళ్ళి చూచుటకుఁ దగిన సమయమే యిది.

విదూ—అయినచో బయలు దేరుము. నేనును దేవినిజూచుటకే దేని యుపాయనముఁ దెత్తును.

రాజు—జయసేనతోఁ జెప్పి మఱీ వెళ్ళుము.

విదూ—అట్లే. (జయసేన చెవిలో) ఇ — లా — గ (అని వెళ్ళును.)

రాజు—జయసేనా! ప్రవాతశయనమునకు మార్గముఁ జూపుము.

ప్రతీ—ఇటు. ఇటు.

[శయ్యాస్థితయగు దేవి, పరివ్రాజిక, కొందఱు పరిచారికలు ప్రవేశింతురు.]

ధారిణి—భగవతి! కథ అందముగా నున్నది. తరువాత?

పరి—(దృష్టిక్షేపముతో) తరువాతికథను తిరిగి చెప్పెదను. ప్రభువులు విచ్చేయుచున్నారు.

ధారి—ఓహో! రాజుగారా? (లేవఁబోవును.)

రాజు—దేవి! ఉపచారానురోధము వలదు. తపనీయపీఠాధిష్ఠితమై, బాధాపరీతమై, నూపురవిహీతమై యున్న యీ చరణమును, నన్నును, బాధింపకుము.

ధారి—ఆర్యపుత్రులకు విజయ మగు గాక,

పరి—ప్రభువులకు విజయ మగుఁగాక.

రాజు—(పరివ్రాజికకు నమస్కరించి, యాసీనుఁడై) దేవి! నీ బాధ యెట్లున్నది?

ధారి—కొంచెము నయముగనే యున్నది.

[జందెమును వ్రేలికి బిగించుకొని విదూషకుఁడు ప్రవేశించును.]

విదూ—రక్షింపుఁడు రక్షింపుఁడు. మృత్యురూప మగు కాల సర్పము వాతఁ బడితిని.

[అందఱు విషణ్ణు లగుదురు.]

రాజు—కష్టము కష్టము. నీ వెక్కడ తిరిగితి వోయీ!

విదూ—దేవీ దర్శనార్థమై సంప్రదాయానురోధముగఁ బుష్పములఁ గొనివచ్చుటకై ప్రమదవనమున కేగితిని.

ధారి—అయ్యో! అయ్యో! నేనే యీ బ్రాహ్మణోత్తముని జీవితసంశయమునకు హేతువు నయితినే.

విదూ—అచ్చట నశోకపుష్పమునకై దక్షిణహస్తముఁ జాపితిని. అనంతర మా కోటరమునుండి బయలు దేరిన నాగాంతకునిచేఁ గఱవఁబడితిని. ఇవిగో. రెండు కాట్లు. (అని చూపును)

పరి—అయినచో, కాటు వేసినంత మేర వెంటనే తీసివేయ వలె నని విందుము. ఆ పని చేయింపుఁడు. లేదా ఆ మేరకుఁ దగులఁబెట్టుట కాని, రక్తము పిండివై చుట గాని సర్పదష్టుల కాయుఃప్రద చికిత్సలై యున్నవి.

రాజు—ఇది విషవైద్యుల పని. జయసేనా! ధ్రువసిద్ధిని త్వరగాఁ దీసికొని రమ్ము.

ప్రతీ—చిత్తము. (నిష్క్రమించును.)

విదూ—అయ్యో! పాడుమృత్యువు లాగుకొనిపోవుచున్నదే.

రాజు—భయపడకుము. విషముదిగని కాఁటుకూడ నొకప్పు డుండవచ్చును.

విదూ—ఎట్లు భయపడకుందు నయ్యా! నా అవయవములు చిమచిమ లాడుచున్నవి. (విషమెక్కుట నటించును.)

ధారి—(సమీపించి) అయ్యయో! విషమెక్కుటచే నశుభము వాటిల్లుచున్నది. ఓసీ! ఇతనినిఁ బట్టుకొనుము.

(పరిజనులు పట్టుకొందురు.)

విదూ—(రాజును జూచి) అయ్యా! ఆబాల్యప్రియమిత్రుఁడను. ఈ విషయ మాలోచించి, పుత్రవియోగసంతప్త యగు మా జనని యోగక్షేమము లరయుదువు గాక.

రాజు—భయపడకుము. త్వరలోనే విషవైద్యుఁడు వచ్చి చికిత్స చేయఁగలఁడు. ధైర్యముగ నుండుము.

(ప్రవేశించి)

జయ—దేవ! తమ రాజ్ఞాపించిన ధ్రువసిద్ధి, గౌతముని తన యొద్దకుఁ దీసికొని రావలె నని విన్నవించుచున్నాఁడు.

రాజు— అయినచో మీ రే కొందఱు తనిని ధ్రువసిద్ధికడకుఁ దీసికొని వెళ్లుఁడు.

జయ—చిత్తము.

విదూ—(దేవిని జూచి) అమ్మా! బ్రతుకుదునో చత్తునో. ఈ ప్రియవయస్యుని సేవించుచు, నేనేమేని యపరాధ మొనర్చినచో క్షమింపఁగోరెద.

ధారి—దీర్ఘాయు వగుము.

(విదూషకుఁడు ప్రతీహారియు నిష్క్రమింతురు.)

రాజు—గౌతముఁడు వట్టి పిరికివాఁడు. అన్వర్థనామధేయుఁడగు ధ్రువసిద్ధి ప్రయోగసిద్ధి నైనఁ దలంపఁడు.

(ప్రవేశించి)

జయ—ప్రభువులకు జయము. కడవపోతగ నీటిచే స్నానము గావింపవలెననియు నందుకై సర్పముద్రిత మైన దేదేని కావలెననియు ధ్రువసిద్ధి విన్నవించుచున్నాఁడు.

ధారి—ఇదిగో. సర్పముద్రాంచిత మగు నంగుళీయకము. దీని పని తీఱినపిదప తిరిగి నాచేతికే యిమ్ము.

(అని యుంగర మిచ్చును. ప్రతీహారి తీసికొనును.)

రాజు—కార్యసిద్ధికై త్వరపడవలెను.

జయ—చిత్తము. (నిష్క్రమించును.)

పరి—దేవ! గౌతమునకు విష మెక్కలే దనియే నా హృదయము చెప్పుచున్నది.

రాజు—అట్లే యగుఁ గాక.

జయ—(ప్రవేశించి) దేవ! నివృత్తవిషవేగుఁడై గౌతముఁడు క్షణములోనే సుఖముగ నున్నాఁడు.

ధారి—అదృష్టముచే నపకీర్తి తప్పినది.

జయ—అమాత్యపుంగవుఁడు వాహంతకుఁడు "రాచకార్యములు మాటాడవలసినవి చాల యున్నవనియుఁ బ్రభువులదర్శనము గోరుచున్నా" ననియు విన్నవించుచున్నాఁడు.

ధారి—కార్యసిద్ధికై ప్రభువులు బయలుదేరుదురుగాక.

రాజు—దేవి ! ఇచ్చటి కెండ వచ్చుచున్నది. శైత్యోపచారమీ వ్యాధికిఁ బ్రశస్తము. కనుక శయ్యను మఱియొక తావునకు మార్చవలెను.

ధారి—పరిచారికలు ప్రభువచన మాచరింతురుగాక.

పరిచారికలు—చిత్తము. (దేవి, పరివ్రాజిక, పరిజనము నిష్క్రమింతురు.)

రాజు—జయసేన ! రహస్యముగ నన్ను బ్రమదవనమునకుఁ గొనిపొమ్ము.

జయ—ఇటు ఇటు.

రాజు—గౌతముని పని పూర్తియైనదా ?

జయ—చిత్తము.

రాజు—అభీష్టసిద్ధి చాలవఱకు సవ్యముగ నేయున్నను నాపిరికిగుండె సందేహమునే శంకించుచున్నది.

విదూ—(ప్రవేశించి) ప్రభువులకు జయము జయము. ఏలినవారి మంగళకృత్యములు సిద్ధించినవి.

రాజు—జయసేనా ! నీపని చూచుకొమ్ము.

జయ—చిత్తము. (నిష్క్రమించును.)

రాజు—గౌతమ ! మాధవిక నిచూపించిన. ఏమియు ననుమా నింపలేదుకద.

విదూ—దేవియుంగరమును జూచి యింక నేల శంకించును ?

రాజు—ఉంగరమును జూచి చెప్పుటలేదు. "ఆ బందీకృతల నెందులకు విడిపించుట ? దేవిపరిజనమునకు బదులుగ నీవు వచ్చితివేల ?" అని యడుగలేదా ?

విదూ—అడుగకేమి ? అడిగినది. చెప్పితిని. అవ్యుత్పన్నుడ నైనను సమయస్ఫూర్తిగనే చెప్పితిని.

రాజు—ఏమని చెప్పితివి ? చెప్పుము.

విదూ—ప్రభువుల జన్మనక్షత్ర మహోత్సవ మగుటచే ఖైదీలను విడిచిపుచ్చవలె నని జ్యోతిష్కులు కోరి నట్లుగా చెప్పితిని.

రాజు—(హర్షముతో) తరువాత !

విదూ—అదివిని, ఇరావతి మనసుకనిపెట్టి సంచరించెడి ధారిణి "రాజుగారికే ఖైదీలను విడిచిపెట్టుట కనుమతించినా" రని నాచే కబురు పంపిన దంటిని. బాగున్న దని యామెయు నట్లు చేసినది.

రాజు—(విదూషకుని జూచి) మిత్రమా ! నీవు బ్రియ మిత్రుండవుగదా! మిత్రుల బుద్ధికుశలతచే నర్థములు సిద్ధించుటయే కాదు. కార్యసిద్ధిపథముకూడ నుపలబ్ధ మగును.

విదూ—నీవు త్వరపడవలెను. సఖీసమేత యగు మాళవికను సముద్రగృహమందు దాచి నీకొఱకై వచ్చితిని.

రాజు—ఆమెను సత్కరింతును. ముందు నడువుము.

విదూ—ఇటు ఇటు. ఇదిగో సముద్రగృహము.

రాజు—(సందేహముతో) మిత్రమా! దేవీపరిచారిక యగు చంద్రిక పూవులు గోసికొనుచు మనదగ్గరకే వచ్చుచున్నది. గోడచాటున దాగియుందము రా.

విదూ—కాముకులును దస్కరులును జంద్రికను బరిహరింపవలసినదే. (ఇద్దఱును దాగియుందురు.)

రాజు—మిత్రమా! నీ చెలికత్తె మాళవిక న న్నెంతగా నిరీక్షించుచుండునో కదా రమ్ము. ఈ కిటికీలోఁ గూర్చుండి చూతము.

విదూ—అట్లే. (ఇర్వురును జూచుచుందురు.)

[మాళవికా వకుళావళికలు ప్రవేశింతురు.]

వకు—సఖి! ప్రభువులకు నమస్కరింపుము.

మాళ—నమస్తే.

రాజు—నా చిత్రపటమును వీక్షించుచున్న దనుకొందును.

మాళ—(సంతోషముతో, ద్వారమువంకచూచి) సఖీ! నన్ను వంచించుచుంటివా? (విషణ్ణ యగును.)

రాజు—మాళవికాహర్షవిషాదముల కెంతయు సంతసించుచున్నాను. ఉదయాస్తమయములందలి యరవింద

శోభలు యథాతథముగ నీమోముఖబింబమున నొప్పి యున్నవి.

వకు—ఇదిగో. చిత్రపటమం దున్నరా..

ఇర్వురు—(నమస్కరించి) ప్రభువులకు జయము.

మాళ—సఖీ! హడావిడిగ ఆనాడు ప్రభువును దర్శించి నపుడెట్లు తనివి తీరకుండెనో యిప్పుడును నట్లే తనివి తీరకున్నది.

విదూ—వింటివా? నిన్నుఁ జిత్రమునం దెట్లు చూచినగో యట్లే యిప్పుడును జూచుచున్న దఁట. మంజూష. రత్నభాండమును వలె నీముద్దరాలు యౌవనగర్వమును వహించుచున్నదయ్యా!

రాజు—మిత్రమా! కుతూహలాయత్తచిత్తలైనను స్త్రీలు నిండుకుండలు సుమా! చూడుము. ప్రప్రథమసమావేశమందే ప్రియుల సౌందర్యాతిశయమును వర్ణింపవలె నని యెంత మక్కువయున్నను వారి నయనము లాపసిని నెఱవేర్పఁ జాలవు.

మాళ—సఖీ! ఈమె యెవరు? ప్రభువులు ప్రక్కకుఁ దిరిగి శ్రద్ధగాఁ జూచుచున్నారు?

వకు—ఈ ప్రక్క నున్న యీమెయే యిరావతి.

మాళ—సఖీ! ప్రభువు దక్షిణనాయకుఁడు కాదు సుమా! అంతఃపురస్త్రీ లందఱికంటె నీమె నెక్కుడు ధ్యానముతోఁ జూచుచున్నాఁడు.

వకు—(తనలో) చిత్రపటములోని ప్రభువును యథార్థముగ గ్రహించి యనురాగపడుచున్నది. కానిమ్ము. కొంతసే పీమెతోఁ గ్రీడింతును. (ప్రకాశముగ) సఖీ! ప్రభువుల కీమె ప్రియవల్లభ.

మాళ—అగుచో నిష్కారణముగ నాయాసపడుచుంటి నెందులకు?

రాజు—మిత్రమా! చూడుము. (గ్రీవాభంగముచే బీటలు వారిన అలకలతో స్ఫురితాధరోష్ఠముతో, పెడముఖము పెట్టుచున్న యీయమె కాంతాపరాధకుపితల విషయమై, శాస్త్రీయమగు నభినయమును బ్రదర్శించుచున్నదివలె నున్నది.

విదూ—ఇంక బ్రతిమాలుకొనుటకు సంసిద్ధుఁడవగుము.

మాళ—ఆర్యగౌతముఁడు కూడ యిచటనే ప్రభువులను సేవించుచున్నాఁడే. (మఱియొకవైపునకుఁ దిరుగును.)

వకు—(మాళవికను దనవంకకుఁ ద్రిప్పుకొని) నీకిప్పుడుకోపము రాలేదు గదా!

మాళ—కోపము వచ్చినట్లుగనే భావించితివా? అయితే, ఇదిగో నా కోపమును బరిత్యజించుచున్నాను.

రాజు—(సమీపించి) ప్రియా! చిత్రపటమందలి చేష్టను జూచి నాయెడఁ గోపగించుచుంటివా? నేను నీ కనితర సాధారణుఁడ నగు దాసుఁడను సుమీ.

మాళ — (తనలో) చిత్రపటమును జూచియా నే నసూయ పడినను.)

రాజు — (మాళవికాహస్తము గ్రహించును.)

విదూ — ఏమిది? ఏమి నీవు నిద్రించుచుంటివి?

రాజు — సఖా! సంచారాలు విశ్వసనీయురాలు కాదు.

విదూ — ఈ సుందరిపట్ల నీకీ యవిశ్వాస మెట్లు కలిగినది?

రాజు — వినుము. స్వప్నమునందీ సుందరి దృష్టిపథగత యయ్యెను మేల్కొనినంత నంతర్హిత యగుచున్నది. కాబట్టి స్వప్నమువలె నిది హఠాత్తుగా నాకస్మికముగా జారిపోవుచున్నది. మదనపరవశుండ నగు నే నీమె నెట్లు విశ్వసింతును?

వకు — సఖా! చాల పర్యాయములు ప్రభువులను వంచించితివి. కావున నిన్నిప్పుడు విశ్వసనీయునిగఁ జేసికొమ్ము.

మాళ — సఖీ! ఈ మందదృష్టిశాలినికి స్వప్నమందైనను ప్రభువులదర్శనము దుర్లభమైనది.

వకు — ప్రభువులే యీమెకుఁ బ్రత్యుత్తర మొసంగవలెను.

రాజు — ప్రత్యుత్తరములతోఁ బనేమున్నది? పంచబాణాగ్నిసాక్షిగ నీసఖురాలికి నేనే స్వయందత్తుండ నైతిని. సేవింపనేకాని సేవింపఁబడను.

వకు — ప్రభువు లనుగ్రహించినారు.

విదూ — (పరిక్రమించి, సంభ్రమముతో) వకుళావళికా! ఈ హరిణములు బాలాశోకములను మేయుచున్నవి. తోలుదము రమ్ము.

వకు—అలాగే. (బయలుదేరును.)

రాజు—వయస్యా! ఇక్కడ మారరక్షణవ్యాపారమున జాగరూకుఁడవై యుండవలె సుమీ.

విదూ—ఈ మాటకూడా నాకుఁ జెప్పవలెనా?

వకు—(పరిక్రమించి) ఆర్యగౌతమా! నేను గూఢముగ నుందును. నీవు ద్వారపరిరక్షకుఁడవై యుండుము.

(వకుళావళిక నిష్క్రమించును.)

విదూ—అలాగే. ఈ స్ఫటికశిలపైఁ గూర్చుండెదను. (కూర్చుండి) ఆహా! ఈ రాయి యెంత చల్లగా నున్నది. (అని నిద్రపోవును.)

(మాళవిక భయముతో నిలఁబడును.)

రాజు—ఓ సుందరీ! చిరకాలమునుండియు నీకై పరితపించుచు సహకారద్రుమత్వము నందియున్న నాయెడ నిర్భయముగా నతిముక్తలతాచరితమును నిర్వహింపుము.

మాళ—నాకిష్టమున్నను దేవీభయముచే మిన్నకుంటిని.

రాజు—భయపడవలదు.

మాళ—(తిరస్కారముతో) భయపడరు కాఁబోలు తమరు.

రాజు—సుందరీ! దాక్షిణ్యము మా కులవ్రతము. కావున నా ప్రాణములే నీ యధీనములై యున్నవి. చిరానురక్తుఁడ నగు నన్ననుగ్రహింపుము. (అని కౌఁగలించుకొనఁబోవును.)

(మాళవిక త్రోసివేయును.)

రాజు—(తనలో) అంగనల నూత్నయౌవనావతారము రమణీయము కదా ! ఈమె, రశనావ్యాపారలోలాంగుళి యగు కరము నడ్డుపెట్టుచున్నది. బలవంతముగ నాలింగనము చేసికొనఁబోఁగా హస్తములను స్తనముల కడ్డుపెట్టుచున్నది. అధరపానమునకుద్యుక్తుఁడను గాఁగా ముఖమును బ్రక్కకుఁ ద్రిప్పుకొనుచున్నది. వ్యాజముచేనైనను నా కోరిక నీడేర్చుచునేయున్నది.

[ఇరావతి, నిపుణిక ప్రవేశింతురు.]

ఇరా—నిపుణికా ! "సముద్ర గృహద్వారమందార్య గౌతముఁ డొంటరిగ నిద్రించుచున్నాఁ" డని చంద్రిక నీతోఁ జెప్పిన మాట సత్యమేనా?

నిపు—సత్యము కాకున్నచోఁ దమ కెట్లు విన్నవింతును ?

ఇరా—అయినచో నచ్చటికే పోవుదము. చచ్చిబ్రతికిన గౌతముని జూచుటకును,

నిపు—ఇంకేమో చెప్పవచ్చినట్లున్నారు ?

ఇరా—చిత్రపటగతుఁ డగు నార్యపుత్రుఁడు మున్నెట్లుండెనో యట్లె యిప్పుడు నన్యసంక్రాంతహృదయుఁడై యున్నాఁడు. కేవలము మర్యాదాతిక్రమదోషమును రూపుమాపికొనుటకే యీ ప్రయత్నము.

(పరిక్రమింతురు.)

నిపు—దేవి ! ఇటు ఇటు.

[ప్రవేశించి]

**నిపుణిక**—దేవికి జయము. మహారాణి చెప్పుచున్నది. "ఇది నాకు నుపచరించుటకు సమయము గాదు. నీ గౌరవమును బెంపొందించుటకే మాళవికా వకుళావళికలను జెరసాల యందుంచితిని. నీ యిష్ట మున్నచో నారీ పుత్రుని యభీష్ట మీడేర్చెదను. నీ సమ్మతి యెట్టిదో తెల్పుము" అని.

**ఇరా**—నిపుణికా! మహారాణికి విన్నవింపుము. "మహారాణిని నియమించుటకు నే నెవరను? పరిజన నిగ్రహముచే నాయం దనుగ్రహము చూపబడినది. మీరుగాక మమ్ముం బ్రసన్నలను జేయువా రింకెవరు?" అని.

**నిపు**—అలాగే. (నిష్క్రమించును.)

**నిపు**—(పరిక్రమించి, చూచి) ఈ గౌతముఁడు పెచ్చుపోసిన యాంబోతువలె సమ్మములోం గూర్చుండియే కునికి పాట్లు పడుచున్నాడు.

**ఇరా**—పాపము. ఇంకను విషవికారము తొలగదా!

**నిపు**—ముఖము నిర్మలముగ నున్నది. మఱియుం జికిత్సచేసి నది ధ్రువసిద్ధి కదా! అన్యథాశంక కూడదు.

**విదూ**—(కలవరించుచు) మాళవికా!

**నిపు**—దేవీ! వింటివా? స్వార్థపరుం డయిన యీ మహాతాశుం డిచ్చటి స్వస్తివాచనమోదకములచేం బొట్ట నిండించుకొనుచు నిప్పుడు మాళవికను బలవరించుచున్నాఁడు.

విదూ—ఇరావతి నతిక్రమింపుము.

నిపు—ఇది మతీ సహింపరానిది. భుజంగభీరువగు నీ బ్రాహ్మ ణుని భుజంగకుటిల మగు నీ దండకాష్ఠముతో స్తంభాం తరితనై యొక్కు పెట్టు పెట్టెదను.

ఇరా—కృతఘ్నుఁడీశికుఁ కర్హుఁడే.

(నిపుణిక విదూషకునిపై దండకాష్ఠమును విసరివేయును)

విదూ—(తొందరగా మేల్కొని) అయ్యో! పాము నామీఁద పడినది.

రాజు—(తొందరగ వచ్చి.) మిత్రమా! భయపడవలదు. భయపడవలదు.

మాళ—(అనుసరించి) ప్రభూ! తొందరగా వెళ్ళకుఁడు. పాముచున్నాఁడు.

ఇరా—ఆహా! హా! ప్రభువులును నిచటనుండియే పరుగెత్తు కొని వచ్చుచున్నారు.

విదూ—(నవ్వుచు) ఏమిది! కొంకికట్టయా! మొగలి పూలముండ్లతో గాట్లు పొడుచుకొని, "పాముకాటు"ని మునుపు గోలచేసినందుకు ఫలమేమో" అని యను కొనినాను.

(హఠాత్తుగ వకుళావళిక ప్రవేశించును.)

వకు—(కంగారుతో) ప్రభువులు ప్రవేశింపవలదు. కుటిలగతి యగు సర్పమువలె నున్నది.

ఇరా—(తొందరగా రాజును జేరి) మీమిథున మేర్పరచికొన్న దివాసంకేతము నిర్విఘ్నమనోరథ మే కదా!

(అందఱు ఇరావతిని జూచి సంభ్రాంతు లగుదురు.)

రాజు—ప్రియురాలా! ఈ యుపచారము క్రొత్తగ నున్నదే

ఇరా—వకుళావళికా! తారు్వడుప్రజ్ఞ పూర్తియైనదా?

వకు—దేవి! అనుగ్రహింపుఁడు. కప్ప లఱచు నని పర్జన్యుఁడు వర్షింపకుండునా?

విదూ—అది కాదు. మిమ్ముఁజూచినంతనే యితఁడు మీ రొసఁగిన ప్రణిపాత లంఘనమును విస్మరించినాఁడు. మీ రింక ననుగ్రహింపకున్నారు.

ఇరా—కోపించి నే నేమి చేయఁగలను?

రాజు—నిష్కారణకోపము నీకుఁ దగదు. చూడుము. సుందరీ! కారణము వినాగా నీముఖ మిప్పుడుకోపపాత్ర మైనది. పర్వము లేకయే విభావరి గ్రహాకలు షేందుమండల యగునా?

ఇరా—"కారణము వినాగా" అని ప్రభువులు చక్కగాఁ బలికినారు. నా యదృష్ట మన్యసంక్రాంత మైనపుడు నేను కోపగించుట హాస్యాస్పదమే.

రాజు—నీ వన్యథా సమర్థించుచుంటివి. నేను నిజమే చెప్పుచున్నాను. ఈ విషయమున నీవు కోపించవలసిన పని లేదు. ఏమన; "ఉత్సవదివసములందు పరిజనులు కృతాపరాధు లైనను బందీలనుగ నుంచుటభావ్యము

కాద''ని వీరిని విడిపించితిని. అందులకు నాకు నమస్క రించుటకై వచ్చిరి.

ఇరా.—నిపుణికా ! పద. "మీ పక్షపాత మంతయు విశద మైన'' దని దేవికి విన్నవింపుము.

నిపు—చిత్తము. (నిష్క్రమించును.)

విదూ—(తనలో) అనర్థము వాటిల్లినదే. పంజరవిముక్త మైన పావురము పిల్లికంటఁ బడినదే.

(ప్రవేశించి)

నిపు—(పరిక్రమించి) అమ్మా ! యదృచ్ఛాదృష్ట యగు మాధవిక చెప్పినది. "ఇదంతయు సిలాఇలా జరిగిన దఁట. (అని చెవిలోఁ జెప్పును.)

ఇరా—అంతయు సరిగా నున్నది. నిజముగ నీ బ్రాహ్మ ణ్యుఁ డీమంత్రప్రయోగమును బ్రద్దలు చేసినాఁడు. (విదూషకుని జూచి) (ప్రకాశముగ,) ఇదియా! కామ తంత్రసచివుఁ డగు బ్రాహ్మణోత్తముని నీతి ?

విదూ—అమ్మా ! నీతియుతముగ నొక్క యక్షర మైనను జదువుకొన్నచో నీమహాభాగుని సేవింపకయే యుండె డివాఁడను.

రాజు—ఈసంకటమునుండి బయట పడు టెట్లు?

(జయసేన ప్రవేశించి)

జయ—(ఆవేగముతో) వసులక్ష్మి బంతియాడుకొనుచుఁ బింగళవానరమును జూచి జడిసికొన్నది. దేవి యెత్తి కొన్నను బ్రవాతకిసలయ మట్లు వణకిపోవుచున్నది. ఇప్పటి కింకను స్వస్థత నొందకున్నది.

రాజు—కష్టము. శైశవము భయంకరము.

ఇరా—(ఆవేగముతో) ఈ బాలిక నోదార్చుటకా ర్య పుత్రుఁడే త్వరపడవలెను. భయజనితవికారము వృద్ధి నొందకుండుగాక.

రాజు—నేను వెళ్ళి చికిత్స చేయుదును.

(అని త్వరగాఁ బోవును.)

విదూ—(తనలో) బాగు. పింగళవానరా! బాగు. మా పక్షమును జక్కగా రక్షించితివి.

(మాళవిక వకుళావళికలుతక్క అందఱు నిష్క్రమింతురు.)

మాళ—సఖీ! దేవిని దలపెట్టినపు డెల్ల నా హృదయము కంపించుచున్నది. ఇఁక ముం దింతకంటె నే మనుభ వింపవలెనో తెలియకున్నది.

[తెరలో]

(ఆశ్చర్య మాశ్చర్యము. అయిదురాత్రులు నిండక మునుపే తపనీయాశోకము మొగ్గతొడగినది.
దేవికి విన్నవింతము.)

(ఇద్దఱు విని సంతసింతురు.)

వకు—సఖీ! ఊరడిల్లుము. ధారిణి సత్యప్రతిజ్ఞురాలు సుమా!

మాళ—అయినచో మనము ప్రమదవనపాలిక ననుసరింతము.

వకు—అలాగే.

(అందఱు నిష్క్రమింతురు)

# మాళవికాగ్నిమిత్రము

## పంచమాంకము



[ఉద్యానపాలికయగు మధుకరిక ప్రవేశించును.]

మధు—సత్కారమందిన తపనీయాశోకమునకు వేదికాబంధమొనర్చుట పూర్తియైనది. నా నియోగమును దేవికి విన్నవింతును. (పరిక్రమించి) ఆహా! మాళవిక దైవకృపకుఁ బాత్రురాలైనది. ఈమెవిషయమై దేవి యప్పుడట్లు ప్రచండురాలయ్యెను, నశోకకుసుమవృత్తాంతశ్రవణముచేఁ బ్రసన్నురాలు కాఁగలదు. ఇప్పుడు దేవి యెచ్చట నుండునో? (చూచి) ఓహో! దేవీపరివారకుఁడు సారసకుఁడు సీలువేసిన కవరు నేదో తీసికొని చతుశ్శాలనుండి పోవుచున్నాఁడు. ఇతనినడిగెదను. (ప్రకాశముగా) సారసక! ఎచటికి బయలుదేరితివి?

సార—మధుకరికా! వేదపారగులగు బ్రాహ్మణులకు నిత్యదక్షిణనీయవలెను. దీని నార్యపురోహితున కిచ్చుటకు బయలుదేరితిని.

మధు—ఎందునిమిత్తము?

సార—యజ్ఞతురగరక్షణకై వసుమిత్రుఁడు నియుక్తుఁ డైనట్లు సేనాపతివలనఁ దెలిసికొని యతని యాయు ర్వృద్ధికై యష్టాదశసువర్ణపరిమిత మగు దక్షిణను ధారిణీదేవి బ్రాహ్మణుల కిచ్చుచున్నది.

మధు—బాగున్నది. ఇప్పుడు దేవి యెచ్చట నుండును? ఏమి చేయుచుండును?

సార—మంగళగృహమున సుఖాసీనయై విదర్భనుండి సోదరుఁ డగు వీరసేనుఁ డంపిన లేఖను వినుచున్నది.

మధు—విదర్భరాజ వృత్తాంత మే మనుకొనుచున్నారు?

సార—వీరసేనప్రముఖు లగు సైనికులకు విదర్భనాథుఁడు వశీకృతుఁ డయ్యెనఁట. ఇతనికి దాయాది యగు మాధవసేనుఁడు విడిపింపఁ బడినాఁడఁట. అతనిచే రత్నములు, వాహనములు, శిల్పకారికాభూయిష్ఠ మగు పరిజనము, కానుకగాఁ బ్రభువులకుఁ బంపఁ బడెనఁట. అతఁడు పంపిన దూత రేపటఁ బ్రభువు లను దర్శించునఁట.

మధు—సరే. వెళ్ళుము. నీ నియోగము నెఱవేర్చితివి. నేనును దేవిని జూచుటకు వెళ్ళెదను. (నిష్క్రమింతురు)

[ప్రతీహారి ప్రవేశించును.]

ప్రతీ—అశోకసత్కారవ్యాపృత యగు దేవి యాజ్ఞాపించి నది. "ఆర్యపుత్రునకు విన్నవింపుము. ఆర్యపుత్రు నితోఁ గలిసి యశోకప్రసూనలక్ష్మిని దర్శింపవలెను"

అని. కావున ధర్మాసనారూఢుఁ డగు ప్రభువును సమీపింతును. (నిష్క్రమించును.)

[తెరలో వైతాళికులు]

ప్రథముఁడు—ఓ రాజా ! పరభృతకూజితములచే నలరారు విదిశాతీరోద్యానములం దాకృతిఁ దాల్చిన మన్మథుని వలె నీవు మధుసేవనముఁ జేయుచున్నావు. జయకుంజరములను గట్టివేసెడి వరదానదీతీరవృక్షములతో సహితముగ నీశత్రు వవనతుఁడైనాఁడు.

ద్వితీయుఁడు—ఓ రాజా ! దేవతాతుల్యు లగు విచక్షుణలచే, క్రథకైశికముల నాక్రమించియున్న నీచరిత్రము గానయోగ్యముగఁ జేయబడినది. సైనికులచే విదర్భాధిపుని రాజ్యలక్ష్మిని జెట్టఁబట్టిన నీకును, భుజబలముచే రుక్మిణిని జెట్టబట్టిన విష్ణువునకును సామ్యము గల్పింపఁబడినది.

ప్రతీ—జయశబ్దముచేఁ బ్రస్థానమును సూచించుచుఁ బ్రభువు లిటు వచ్చుచున్నారు. నేను గొంచెము ప్రక్కకుఁ దొలఁగి యీ బహిర్ద్వారమున నుండెద. (అని యేకాంతముగ నుండును.)

[రాజు, విదూషకుఁడు ప్రవేశింతురు.]

రాజు—కష్టసాధ్య యగు మాళవికను దలంచియు, విజితుఁడైన విదర్భాధిపుని వినియు, నాతపమున ధారాభిహత

మగుఁ బద్మమువలె నాహృదయము కష్టసుఖముల రెండింటిని ననుభవించుచున్నది.

విదూ—నే ననుకొనినట్లు నీవేకాంతసుఖతుఁడవు. కాఁగలవు.

రాజు—మిత్రమా! ఎట్లు?

విదూ—నేఁడు ధారిణీదేవి పండితకౌశికితోఁ జెప్పినది. అమ్మా! నీకుఁ బ్రసాధనగర్వము కలదేని మాళవికకు వైవాహికాలంకాకరణ మొనర్పుము'' అని. మాళవికయు సవిశేషముగ నలంకరింపఁబడినది. ఆధారిణియే యిప్పటికైనను నీకోర్కెను బూరించును.

రాజు—మిత్రమా! ధారిణి యిప్పటివలె నీర్ష్యాగ్రస్త కాక యథాపూర్వముగనున్నచో నిట్లనుకొనుట కవకాశ ముండెడిదే.

ప్రతీ—(సమీపించి) ప్రభువులకు జయము. దేవి విన్నవించుచున్నది. "అశోకకుసుమసౌభాగ్య సందర్శనముచేఁ దమ యత్నము సఫలముచేయవలె'' నని.

రాజు—దేవి యచటనే యున్నదా?

ప్రతీ—అవును. అంతః పురజనమును నుచితరీతిని సత్కరించి మాళవికాపురస్సరంబుగస్వీయపరివారముతోఁబండిత కౌశికీసమేతయై ప్రభువులను నిరీక్షించుచున్నది.

రాజు—(సంతోషముతో విదూషకుని జూచి) జయసేనా! నీవు ముందు నడువుము.

ప్రతీ—ఇటు. ఇటు. (పరిక్రమించును.)

విదూ—(చూచి)వయస్యా! ప్రమదవనశోభను దిలకించితివా?

రాజు—అవును. చూచితిని. కురవకఫలభిద్యమానము లగు సహకారములు గల్గి పరిణామాభిముఖమై యున్న యీ వసంతునియావనము మనోహరముగ నున్నది.

విదూ—(పరిక్రమించి) ఈ యశోకము కుసుమస్తబకములచే మేలిముసుగును దాల్చినట్లున్నది. దీనిని జూడుము.

రాజు—ఈయశోకము ప్రసవబంధుర మగుటచే ననన్యసాధారణశోభ నందియున్నది. చూడుము. వసంతవైభవసర్వస్వ మనఁదగు నశోకకుసుమతతి యంతయు, దోహదమునొందిన యీవృక్షమునందే సంక్రమించినట్లున్నది.

విదూ—విస్రబ్ధుండ వగుము. మన మిందఱము సన్నిహితుల మైయున్నను ధారిణి పార్శ్వపరివర్తిని యగు మాళవికనే గౌరవించుచున్నది.

రాజు—(సంతోషముతో) మిత్రమా! చూడుచూడుము. కరకలితకమల యగు రాజ్యలక్ష్మిచే శ్రోతలమువలెఁ బ్రియురాలిచే సవినయముగ ననుష్ఠితమైయున్న యీ మాళవిక నాకే సుముఖురాలై యున్నది.

[ధారిణి, మాళవిక, పరిజనులు ప్రవేశింతురు.]

మాళ—(తనలో) నా కౌతుకాలంకారమునకుఁ గారణ మెఱుఁగుదును. అయినను, హృదయము మాత్రము

తామరాకుపైనీటిబొట్టువలెఁ జలించుచునే యున్నది. మఱియునావామనయనముమాటిమాటికినదరుచున్నది

విదూ—మిత్రమా ! వివాహాలంకారములచే మాళవిక మిక్కిలి శోభిల్లుచున్నది.

రాజు—చూచుచునే యున్నాను. ఉదయోన్ముఖచంద్రిక యగు చైత్రవిభావరి, హిమదూషితములు కాని తారకలచేఁ బ్రకాశించునట్లీమెయుఁ జీరాడని దుకూలములనుధరించి యపరిమితాభరణభూషితయై శోభిల్లుచున్నది.

ధారి—(సమీపించి) ఆర్యపుత్రులకు జయము.

విదూ—తల్లీ ! వృద్ధి నొందుము.

పరి—ప్రభువులకు విజయ మగుఁగాక.

రాజు—భగవతి ! నమస్కారము.

పరి—ఇష్టసిద్ధి రస్తు.

ధారి—(చిఱునవ్వుతో) ఆర్యపుత్రా ! తరుణీసహాయుఁడవగు నీ కీ యశోకమే సంకేతగృహముగఁ గల్పింపఁబడినది.

విదూ—ఆరాధింపఁబడుచున్నావయ్యా!

రాజు—(సిగ్గుతో నశోకమును జూచును.) ఈ యశోకము ధారిణీసత్కారములనొంది వసంతవైభవమున కసూయపడినట్లు కుసుమతతిచేతనే తన కృతజ్ఞతనావిష్కరింపుచున్నది.

విదూ—విస్రబ్ధుఁడవై యౌవనవతి యగు దీనిని జూడుము.

రాజు—దేనిని ?

విదూ—అశోకకుసుమశోభను.

(అందఱును గూర్చుందురు.)

రాజు—(మాళవికను జూచి తనలో) సన్నిధివిప్రయోగము సహింపరానిది గదా ! నేను రథాంగమువలెనుంటిని. మాళవిక నా సహచారిణివలె నున్నది. ధారిణి మా యిర్వురిమధ్యను, సమావేశము నామోదింపని రజనివలె నున్నది.

కంచుకి—(ప్రవేశించి) ప్రభువులకుజయ మగుఁగాక. అమాత్యపుంగవుఁడు విన్నవించుచున్నాఁడు. "విదర్భసంపదతో వచ్చినయిర్వురు శిల్పకారిణులను మార్గపరిశ్రాంతలగుటచేనింతదనుక దీసికొనిరాలేదు. ఇప్పుడువచ్చినారు. ప్రభువులను జూడఁగోరుచున్నారు. అనుజ్ఞ నొసంగుఁడు" అని.

రాజు—ప్రవేశపెట్టుము.

కంచుకి—చిత్తము. (వెళ్ళి, తిరిగి వారలతోఁ బ్రవేశించి) ఇటు దయచేయుఁడు.

ప్రథమ—చెలీ ! మదనికా ! రాజగృహమును సమీపించు కొలఁది నాహృదయ మత్యంత ముత్సుక మగుచున్నది.

ద్వితీయ—జ్యోతిష్మతీ! "రానున్న సుఖదుఃఖములను హృదయస్థితి సూచించు" నని లోకప్రవాదమే కలదు కదా.

ప్రథమ—అది యిప్పుడు యథార్థ మగుఁగాత.

కంచుకి—ప్రభువులు దేవీసమేతులై యిటనే యున్నారు. సమీపింపుఁడు.

(ఇద్దరును సమీపింతురు.)

(మాళవికా పరివ్రాజికలు వీరినిగాంచి పరస్పరము చూచుకొందురు.)

ఇద్దరు—(నమస్కరించి) మహారాజులకును మహారాణికిని జయము.

(రాజాజ్ఞచే నిద్దరును సమాసీనలగుదురు.)

రాజు—ఏ కళను మీరు బాగుగ నభ్యసించితిరి ?

ఇద్దరు—సంగీతమునందుఁ బ్రవేశము కలదు.

రాజు—దేవీ! వీరిలో నొకరిని నీకిచ్చువచ్చినవారిని బరిగ్రహింపుము.

ధారి—మాళవికా! ఇటు చూడుము. సంగీతసహకారిణిగ నీ కిందెవ రిష్టము ?

ఇద్దరు—(మాళవికను జూచి) ఆహా! ఇదిగో భర్తృదారిక. (నమస్కరించి) అమ్మగారికి జయము. (అని కన్నీరునింతురు.)

(అందఱు విస్మయాముగఁ జూతురు.)

రాజు—మీ రెవరు ? ఈమె యేమగును ?

ఇర్వురు—ఈమె మా భర్తృదారిక.

రాజు—ఎట్లూ ?

ఇర్వు—ప్రభువు లవధరింపుఁడు. విదర్భాధిపతి నోడించిన పిమ్మట ప్రభువులచేఁ జెఱనుండి విడిపింపఁబడిన మాధవసేనున కీమె యనుంగుసోదరి. పేరు మాళవిక.

ధారి—ఏమి? రాజపుత్రియా? ఈమె?

రాజు—అయితే యీమె యిట్లున్న దేమి?

మాళ—(నిట్టూర్పు విడిచి, తనలో) దైవనియోగముచేత.

ద్వితీ—మాధవసేనుఁడు శత్రువులకు లోఁగినపు డతని యమాత్యపుంగవుఁ డార్యసుమతి, యీమె నతిరహస్యముగఁ దీసికొని వచ్చినాఁడు.

రాజు—ఇది విన్నవిషయమే. తరువాత?

ద్వితీ—రాజా! తరువాతమాకును దెలియదు.

పరి—తరువాత జరిగినది యీ యభాగ్యురాలు చెప్పఁగలదు.

ఇర్వు—పండితకౌశికి కంఠధ్వనివలె నున్న దే?

మాళ—అవును. ఆమెయే.

ఇర్వు—యతివేషధారిణి యగు పండితకౌశికి కష్టస్థితిలో నున్నట్లగపడుచున్నది. పూజ్యురాలా! నమస్కారము.

పరి—మీకు భద్ర మగుఁ గాక.

రాజు—ఏమి? మీకు వీరందఱు నాప్తవర్గమే యగునా?

పరి—చిత్తము.

విదూ—అయితే యీమెవృత్తాంతమును సవిస్తరముగఁ దెల్పుఁడు.

పరి—(ఖేదముతో) వినుఁడు. మాధవసేనామాత్యుఁ డగు సుమతి నాకు సోదరుఁడే.

రాజు—బాగున్నది. తరువాత?

పరి—మాధవసేనుఁడు బందీకృతుఁ డైనప్పుడీ సుమతి మాళవికకు మీా సంబంధము నభిలషించి నాతోఁగూడ కతిపయ పాంథపరివృతుఁడై నగరమునకు బయలు దేరినాఁడు.

రాజు—తరువాత?

పరి—ఆ పాంథలోక మరణ్యమధ్యమునఁ దోవతప్పినపు డాయుధపాణు లైన శబరసైనికులు ముట్టడించి,

మాళ—(భయపడును.)

విదూ—అమ్మా! భయపడకుము. భూతపూర్వవృత్తాంతమునే కదా యీా భగవతి చెప్పుచున్నది.

రాజు—తరువాత?

పరి—ఆ పాంథలోకమును దరిమివేసిరి.

రాజు—అయ్యో! కష్టతర మగు వృత్తాంతము నింక విననలెను కాఁబోలును.

పరి—పిమ్మట సుమతి మాళవికాపరిత్రాణతత్పరుఁడై వారలతోఁ జాలవఱకుఁ బోరాడి యసుపరిత్యాగముచేఁ బ్రభుభక్తిని వెల్లడించుకొనెను,

ప్రథమ—అయ్యో! అమాత్యపుంగవుఁడు సుమతి నిహతుఁడైనాఁడా?

ద్వితీయ-అయ్యో! కనుకనే కావలయు భర్తృదారికకీదురవస్థ సంప్రాప్తమైనది.

(పరివ్రాజిక కన్నీరు నించును.)

రాజు—పూజ్యురాలా! "జాతస్య మరణం ధ్రువమ్" అని కదా సిద్ధాంతము. ధన్యజీవి యగు సుమతినిగూర్చి విలపింపకుము. తరువాత?

పరి—తరువాత మూర్ఛాగతురాల నగు నేను గొంతవడికిఁ దెల్వి తెచ్చుకొని లేచి చూచుసరికి మాళవిక యగపడలేదు.

రాజు—గొప్పకష్టము ననుభవించినారు.

పరి—అనంతరము సోదరునకుఁ బారలౌకికకృత్యము లొనరించి నవీభూతవైధవ్య దు:ఖముకలదాననై మీ దేశముఁ జొచ్చి యీ కాషాయములను ధరించితిని.

రాజు—ఇదే సజ్జనమార్గము. తరువాత?

పరి—ఈమె ఆటవికులనుండి వీరసేనుని, వీరసేనునినుండి దేవిని నాశ్రయించియున్నది. రాజసౌధమున లబ్ధప్రవేశనై నేనును నీమె నిచ్చటఁ జూచితిని. కథ పూర్తియైనది.

మాళ—(తనలో) ఇంక నిప్పుడు ప్రభువు లే మందురో?

రాజు—కష్టము లెంతటి మస్థితినైనఁ గల్పించును గదా! పట్టమహిషీపదమునకు యోగ్యురాలైనయీమె దాసీ భావముచే,స్నానార్థమై పట్టుపుట్టమట్లు చూడఁబడినది.

ధారి—భగవతి! మాళవిక యాభిజాత్య మెఱింగియు నాకుఁ జెప్ప వైతివి. నేను చాల తప్పుగావించితిని.

పరి—శాంతంపాపమ్. ఒండొక కారణముచే నిర్దయగా నింత దనుక మిన్నకుంటిని.

ధారి—భగవతి! ఏ మా కారణము?

పరి—ఈమె తండ్రి జీవించియున్నప్పుడొక సాధుపుంగవుఁడు వచ్చి నాసమక్షమందే "ఒక్క సంవత్సరముపాటీమె దాసీభావమున నుండి యనంతర మనురూపభర్తృ గామిని యగు" నని వచించె. అది మీచరణశుశ్రూషారూపమునఁ బరిణమించిన దని తలంచి కాలము నిరీక్షించుచు మిన్నకుంటిని.

రాజు—మీప్రతీక్ష చక్కఁగానున్నది.

కంచు—దేవ! కథాంతరముచే నాగితిని. "విదర్భాధిపునకు సంబంధించిన చింతయు ననుష్ఠింపఁబడినది. ప్రభువుల యామోదమును దెలియఁగోరుచున్నాను." అని యమాత్యపుంగవుఁడు విన్నవించుచున్నాఁడు.

రాజు—మౌద్గల్య! పూజ్యులైన యజ్ఞసేనమాధవసేనులను సంస్థానాధిపతులనుగాఁ జేయఁదలంచితిని. దివారాత్ర ములను విభజించుకొనిన సూర్యచంద్రులవలె వీరును

వరదానదీ ప్రాంతమందలి దక్షిణోత్తరభాగములను పాలింతురు గాక.

కంచు—దేవ! ఇట్లే యమాత్యులకు విన్నవింతును.(నిష్క్రమించును.)

ప్రథ—(జనాంతికముగ) అమ్మా! ప్రభువు లనుగ్రహించి భర్తృదారకు నర్ధరాజ్యమునఁ బ్రతిష్ఠించినారు.

మాళ—మృత్యుముఖమునుండి బయటపడు టెంతయుఁ బ్రశంసనీయము.

కంచు—(ప్రవేశించి) ప్రభువులకు జయ మగుఁగాక. అమాత్యులు విన్నవించుచున్నారు. ప్రభువుల యాదేశము నమాత్యబృందమెంతయు గొనియాడుచున్నది. "అని.

రాజు—అయితే, ఆవిధముగఁ గావించునట్లు వీరసేనున కుత్తరము వ్రాయవలసినదిగ నమాత్యపరిషత్తునకుఁ జెప్పుము.

కంచు—చిత్తము. (నిష్క్రమించి, వేఱొక లేఖతో మరలఁ బ్రవేశించి) ప్రభువుల యాజ్ఞ నిర్వర్తింపఁబడినది. సేనాపతి యగు పుష్పమిత్రునికడనుండి యుత్తరీయ పారితోషికముతో నీ లేఖ వచ్చినది. ప్రభువులు చిత్తగింపవలెను.

(రాజు లేచి యుత్తర మందుకొని పరిచారకున కిచ్చును. పరిచారకుఁ డద్దానిని గవరునుండి తీసియిచ్చును.)

ధారి—అమ్మయ్యా! ఈ లేఖ యచటనుండియే వచ్చినది. గురుజనకుశలానంతరము వసుమిత్రుని వృత్తాంతమును వినెదను. నా మనసంతయు నచ్చటనే యున్నది. భారాతిభార మగు కార్యమున నియుక్తుఁడైనాఁడు వసుమిత్రుఁడు.

రాజు—(కూర్చుండి, లేఖను జదువును.) మంగళము. పుష్ప మిత్రుఁడు చిరంజీవి యగు నగ్నిమిత్రు నాలింగన మొనర్చికొని. యజ్ఞశరణమునుండి వ్రాయు లేఖ. రాజయజ్ఞ దీక్షితుఁడ నగు నేను వసుమిత్రుని రక్షకునిగ నియమించి, సంవత్సరపరిమితకాలములోఁ దిరిగివచ్చునట్లుగ యజ్ఞీయాశ్వమును బంపియుంటి నని తమకుఁ దెలిసిన విషయమే. ఆ యశ్వము దక్షిణసము ద్రతీరమున సంచరించుచు యవనసైనికులచేఁబట్టుకోఁ బడెను. అచ్చట నిఱుపక్షములవారికిని గొప్పయుద్ధము జరిగెను.

(దేవి విషణ్ణయగును)

రాజు—ఏమి ? అంతవఱకు వచ్చినదా ? (మిగిలినది చదువును.) పిమ్మట ధనుర్ధారి యగు వసుమిత్రుఁడు శత్రువుల నోడించి తురంగమును మరలించినాఁడు.

ధారి—ఈ వార్తచే సంతసించితిని.

రాజు—(మిగిలినది చదువుచు) సగరపుత్రుఁ డగు నంశుమంతునివలెఁ బ్రత్యాహృతాశ్వుఁడ నగు నే నింక నిర్వి

ఘ్నముగ యజ్ఞము నిర్వహింపఁదలఁచితిని. కనుక వెంటనే నాయందలి ప్రేమచే సకళత్రముగ యజ్ఞ దర్శనమునకు రాఁగోరెద.

రాజు—అనుగ్రహింపఁబడితిని.

పరి—పుత్త్రవిజయముచే రాజదంపతులు వృద్ధి నొందుదురు గాక. దేవీ! ప్రభువులచే వీరపత్నులలో నగ్రేసరత్వమును, బుత్త్రవత్సలునిచే వీరమాతలలో నగ్రగణ్యత్వమును ననుభవింపుము.

ధారి—భగవతి! సంతసించితిని. తండ్రికిఁ దగిన తనయుఁడే వసుమిత్త్రుఁడు.

రాజు—మౌద్గల్య! కలభము యూథపతి ననుకరించినదోయీ!

కంచు—దేవ! ప్రభువులు జన్మకారణులై యుండఁగా వసుమిత్రునియెడ యిదేపాటి?

రాజు—మౌద్గల్యా! యజ్ఞసేనశ్యాలాదులందఱు బంధవిముక్తులు కావలెను.

కంచు—చిత్తము. (నిష్క్రమించును.)

ధారి—జయసేన! పద. ఇరావతీప్రభృతులకుఁ గుమారుని వృత్తాంతము తెలియఁజేయుదము.

(జయసేన నిష్క్రమించును.)

ధారి—జయసేనా! ఇటురమ్ము.

ప్రతీ—(తిరిగి ప్రవేశించి) వచ్చితిని.

ధారి—(జనాంతికముగ) మాళవికావృత్తాంతమును, నశోక దోహదసమయమున నాపెకు నేనొసర్చిన వాగ్దానమును, దెలిపి నామాటగ నిరావతి నాహ్వానింపుము. నాసత్యవ్రతమును బాలింపు మనియుఁ జెప్పుము.

ప్రతీ—చిత్తము. (నిష్క్రమించి, తిరిగి ప్రవేశించి)అమ్మా ! పుత్రవిజయ సంతోషపారవశ్యమున నంతఃపురవాసిను లెల్లరు నాభరణపారితోషికప్రదానముచే న న్నెంతయు బహుమానించిరి.

ధారి—ఇం దేమిచిత్రము ? ఈ సంతోషవార్త యెల్లరకును సాధారణమే కదా !

ప్రతీ—(జనాంతికముగ) ఇరావతి విన్నవించు చున్నది. "ధారిణీదేవి యన్నివిధముల శ్లాఘనీయ. ఆమె పలుకున కన్యథా యుండదు." అని.

ధారి—భగవతి ! నీ యామోదమును బడసి, యార్యసుమతిచేఁ బ్రథమసంకల్పిత యగు మాళవిక నార్యపుత్రున కొసంగఁ దలఁచితిని.

పరి—ఇప్పటికైనను నీవే దీనికి సమర్థురాలవు.

ధారి—(మాళవికచేయి పట్టుకొని) ప్రభువు లీప్రియనివేదన రూప మగుఁ బారితోషికము ననుగ్రహింపుఁడు.

(రాజు సిగ్గుపడును.)

ధారి—(చిఱునవ్వుతో) ప్రభువులు తిరస్కరించుచుంటిరా ?

విదూ—అమ్మా! క్రొత్తపెండ్లికొడుకు సిగ్గుపడుట లోక విదితమే కదా!

(రాజు విదూషకుని జూచును.)

విదూ—పట్టమహిషీ బిరుదముగల మాళవికనే ప్రభువు లామోదింపనున్నారు.

ధారి—ఈమె యాభిజాత్యమే యీమెకు దేవీశబ్దమునొసంగినది. ఇంకఁ బునరుక్తి యేల ?

పరి—అట్లుకాదు. జాతిగత్నమైనను సువర్ణసంయోగముననే ప్రకాశించును.

ధారి—(జ్ఞప్తికిఁ దెచ్చుకొని) పూజ్యురాలా! క్షమింపుము. సంతోషపారవశ్యమున మర్యాద నతిక్రమించితిని. జయసేనా! నీవువెళ్ళి పీతాంబరయుగళమును గొని తెమ్ము.

ప్రతీ—చిత్తము. (నిష్క్రమించి, తిరిగి ప్రవేశించి) అమ్మా! ఇవిగో.

ధారి—(మాళవికకు మేలిముసుగును వైచి) ప్రభువు లీమెను బరిగ్రహింపవలెను.

రాజు—మీశాసనమునకు బద్ధులమైతిమి. (ప్రక్కకుఁ దిరిగి) ఆహా! పరిగ్రహించితినిగదా!

విదూ—ఆహా! ధారిణీదేవి యానుకూల్య మేమని చెప్పవచ్చును ?

(ధారిణి పరిజనులవంక చూచును.)

పరిజనులు—(మాళవికను సమీపించి) మహారాణికిజయము.

(ధారిణి పరివ్రాజికను జూచును.)

పరివ్రా—స్రోతస్వినులితరజలములను గూడ సాగరమును బొందించునట్లు భర్తృవాత్సల్యము గల పడంతులు ప్రతిపక్షసహితముగఁగూడ పతిని సేవింతురు. ఇం దేమి చిత్ర మున్నది ?

నిపుణిక—(ప్రవేశించి) ప్రభువులకుజయము. "ఉపచారాతిక్రమ మనునాయొనర్చినయపరాధము ప్రభువులకనుకూలము గనే పరిణమించినదనియు, నింక, ప్రభువులు పూర్ణ మనోరథులై కటాక్షింపవలె ననియు" దేవి యిరా వతి విన్నవించుచున్నది.

ధారి—నిపుణికా ! నిజముగ నిరావతీసేవ నార్యపుత్రుఁడు స్మరించుచునేయుండును.

నిపు—అనుగ్రహింపఁబడితిని.

పరి—దేవ ! మాధవసేనుని బహూకరించుటకుఁ బోయెదను.

ధారి—పూజ్యురాలా ! మమ్ముఁలను బరిత్యజించుట పాడి గాదు.

రాజు—తల్లీ ! మీకుశల మప్పు డప్పుడు లేఖలమూలమునఁ దెలిసికొందును.

పరి—మీ యనుగ్రహము,

ధారి—వీరా కింకేమి కావలెను.

రాజు—నాయెడ నానుకూల్యమును వహించు టెన్నడును మఱువరాదు. నా పరిపాలనమందలి ప్రజల యభీష్టము లన్నియు నెఱవేరవలెను.

ధారి—తథాస్తు. (అందఱు నిష్క్రమింతురు.)

ఇది పంచమాంకము.

సమాప్తము.



శంకరాభరణరాగము - రూపకతాళము.

నాథ ! హరే ! జగన్నాథ ! హరే !
సీదతి రాధా వాసగృహే ॥నాథ॥

పశ్యతి దిశిదిశి రహసి భవంతం
త్వదధరమధుర మధూనిపిబంతమ్ ॥నాథ॥

త్వదభి సరణరభసేన వలంతీ
పతతిపదాని కియంతి చలంతీ ॥నాథ॥

విహితవిశద బిసకిసలయవలయా
జీవతి పరమిహ తవరతికలయా ॥నాథ॥

ముహురవలోకిత మండనలీలా
మధురిపు రహమితి భావనశీలా ॥నాథ॥

త్వరితముపైతి న కథమభిసారమ్
హరిరితివదతి సఖీ మనువారమ్ ॥నాథ॥

శ్లిష్యతిచుంబతి జలధరకల్పమ్
హరిరుపగత ఇతితిమిర మనల్పమ్ ॥నాథ॥

భవతివిలంబిని విగళితలజ్జా
విలపతిరోదితి వాసకసజ్జా ॥నాథ॥

శ్రీజయదేవ కవే రిదముదితమ్
రసికజనం తనుతా మతిముదితమ్ ॥నాథ॥

---

ఖాక్సు ముద్రాక్షరశాల, రాజమహేంద్రవరము.

*Apply to :*

**Y. Mallikarjuna Rao**

Vice Principal

**A. W. S. COLLEGE,**

**RAJAHMUNDRY.**